EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: ***SHAPE SHIFTER***- GREEN APPLE, ***SPEED***-MANGO, ***FLIGHT***-ORANGE, ***GIANT***-WATERMELON, ***STRENGTH***-RASPBERRY, ***SHRINK***-LYCHEE, ***INVISIBLE***-PINEAPPLE, ***STRETCH***-MUSK MELON, ***FISSION***-BLACK CURRANT, ***FORCE FIELD***-GUAVA.

PARLE

POPPINS®
Doon Kya?

# Ram and Shyam

## బ్లాక్స హోల్ పార్ట్ 1

ఈ అద్భుతమైన శక్తిని అన్‌లాక్ చేసే రహస్యం తెలుసుకొనుటకు
http://www.parleproducts.com/brands/parlepoppins
మరియు www.chandamama.com//parle/index.php?pHcId=11

***RECAP:*** RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHAN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, ***A POWERFUL GADGET*** WITH ***10 POWERS.***

ఏంజిల్‌తో పాటు రామ్ మరియు శ్యామ్ స్పేస్ టూర్‌కు ఆమె కొత్త చల్లని స్పేస్‌షిప్‌లో వెళ్తున్నారు.

చెప్పండి, మీకు నచ్చిందా, నా కొత్త స్పేస్‌షిప్? ఇది నాకు బెల్లట్రిషియన్స్ వారిచ్చిన బహుమతి.

బెల్లట్రిషియన్స్ ఎవరు?

బెల్లట్రిక్స్ ప్లానెట్ నివాసస్థులు, ఈ ప్లానెట్ మహిళా యోద్ధలని కలిగి ఉంటుంది

ఉన్నట్టుండి, వాహనంలో ఏదో తప్పు జరిగినట్టనిపించింది మరియు వారు బ్లాక్ హోల్‌లోకి నెట్టేయబడ్డారు. డెకాట్రిక్స్ రామ్ మరియు శ్యామ్ చేతులని బ్లాక్ హోల్ బయటే కట్టిపడేసింది.

ఏం జరుగుతోంది? నా డెకాట్రిక్స్‌కు చేరువలోనే ఉన్నానే.

కొద్ది నిమిషాల తర్వాత, వారు మరోవైపుకు వెళ్లారు, వారు ముసలి వారిలా కనబడ్డారు.

రామ్, నువ్వేనా, నేనసలు గుర్తుపట్టలేకపోతున్నా.

చూడు! గలాక్సీ నుండి భూమి కనిపించడం లేదు.

శ్యామ్ నువ్వు నీ అంకుల్‌లా మారిపోయావు.

ఈ క్లిష్ట పరిస్థితి గురించి జవాబులని పొందడానికి, ఆర్-22 గలాక్సీలో ఉన్న ఏంజిల్స్ ఇంటికి వెళ్ళారు. జార్టో వారికి స్వాగతం పలికింది.

జార్టోలో ఏం జరుగుతోంది? భూమికి ఏమయింది?

బెల్లట్రిషియన్స్ నాశనం చేసేసారు. నీకు బహుమతిగా ఇచ్చిన స్పేస్‌షిప్‌లో మాగ్నెటిక్ సక్షన్ ఫోర్స్ ఉంది, అది వీళ్ళద్దిరినీ బ్లాక్ హోల్‌లోకి లాగేసింది. ఒక బ్లాక్ హోల్ ద్వారా వెడుతుంటే కొన్ని క్షణాలే అనిపిస్తుంది కానీ అది నిజానికి 25 ఏళ్ళు ముందుకు తీసుకెడుతుంది.

మా నుండి వారేం కోరుతున్నారు?

డెకాట్రిక్స్! డెకాట్రిక్స్ ఇలాంటి సాటిలేని శక్తిని కలిగినప్పటి నుండి, బ్లాక్ హోల్ గుండా వెళ్లరాదు. బెల్లట్రిషియన్స్ దాన్ని ఎంచుకున్నారు, తమ స్వార్థం కోసం వినియోగించుకుంటున్నారు.

రామ్ మరియు శ్యామ్ డెకాట్రిక్స్‌ని పొందడానికి బ్లాక్ హోల్ లోపలికి మరోసారి వెళ్ళాలని నిర్ణయించుకున్నారు.

మనం ఇబ్బందులని ఎదుర్కోవాలి, మన ప్లానెట్ మనకి కావాలి.

ఏంజిల్ కూడా వీరితో చేరింది

రండి అబ్బాయిలు, గెంతండి, నా టైమర్ ప్రకారం ఈ ద్వార 20 ఏళ్ళు వెనక్కి తీసుకెడుతుంది.

వారు బయటికి వెళ్ళే మార్గాన్ని ఎలా మార్చారంటే 20 ఏళ్ళ గతంలోకి, ఏరోజైనా బెల్లట్రిషియన్స్ భూమితో యుద్ధాన్ని ప్రకటించిన రోజుకు, త్వరగా చేరుకునేలా చేసారు.

వారి స్పేస్ షిప్ స్పేస్‌లో మళ్ళీ కనిపిస్తోంది, రామ్ మరియు శ్యామ్ ఇప్పుడు మళ్ళీ టీనేజర్లుగా మారారు. వారు 25 ఏళ్ళు ముందుకు వెళ్ళి మళ్ళీ 20 ఏళ్ళు వెనక్కి వచ్చారు. ఇది 5 ఏళ్ళ వారి అసలైన వయసుపై ప్రభావం చూపింది. మరియు ఇప్పుడు వారు దీనితో జీవించి తీరాలి.

డెకాట్రిక్స్ కూడా ఈ బ్లాక్ హోల్ ప్రభావం నుండి తప్పించుకోలేరు.

తర్వాతి భాగంలో కొనసాగుతుంది...





PRIME MINISTER'S HOUSE
NEW DELHI

June 9, 1960

## MESSAGE

I am interested to learn of the children's magazine "Chandamama". It is rather an unusual feat to issue a children's periodical in six languages. I wish it success.

Jawaharlal Nehru



నవంబర్ 2011 `20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**Content Head - Online :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-2 November 2011 Issue-11

ప్రియపాఠకులారా!!!

దీపావళి మధుర జ్ఞాపకాలనుంచి బయటపడకముందే నవంబర్ నెల వచ్చేసింది. తీపి పదార్థాలు, దీపాలంకరణలు, పటాసులు, మిత్రులు, బంధువులతో సరదాలు... దీపావళి సంబరాలు ఎన్నటికీ ముగియకూడదని మనందరి అభిలాష. పండుగకు సంబంధించి మీ అనుభవాలు మాకు రాసి పంపగలరు. అలాగే మీ ఆలోచనలకు రంగులద్ది, దీపావళి పర్వదినంపై మీ రేఖాచిత్రాలను, వర్ణచిత్రాలను మాకు పంపగలరు.

ప్రతి సంవత్సరంలాగానే మన తొలి ప్రధానమంత్రి చాచా నెహ్రూ జన్మదినాన్ని నవంబర్ 14న జరుపుకుంటాము. పిల్లల పట్ల ఆయన ప్రేమాభిమానాలు మనందరికీ తెలుసు. మనందరికీ ఆయన ప్రేరణ కలిగిస్తారు. ఆయన వ్యక్తిత్వం మనల్ని ఉత్తేజితం చేస్తుంది, ఎంత చిన్నవీ, పెద్దవి అయినా సరే సమస్యలను ఎదుర్కొనేటప్పుడు ఆయన ఆదర్శాలు మనకు శక్తినిస్తాయి. మన తొలి ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ చందమామకు శుభాకాంక్షలు తెలుపుతూ అప్పట్లో రాసిన ఆప్తవాక్యాలను మళ్లీ మననం చేసుకుంటూ ఈ సంచికలో వాటిని ప్రచురిస్తున్నందుకు సంతోషిస్తున్నాము. నవంబర్ నెలలో బాలబాలికల దినోత్సవం రానుంది కాబట్టి, నెహ్రూగారి శుభాకాంక్షలను మననం చేసుకోవడం వల్ల రానున్న రోజుల్లో దేశం కోసం శ్రమించడానికి సంబంధించి మన దృష్టి కోణం బలోపేతమవుతుంది కూడా.

నవంబర్ 9 ప్రపంచ ఆవిష్కర్త దినంగా గుర్తించబడింది. ఇది ఆవిష్కర్త, హాలీవుడ్ నటి హేడీ లమార్ జన్మదినం. సుప్రసిద్ధ వ్యక్తి, సంపన్నురాలు అయిన ఈమె తన వినూత్న ఆలోచన, ఆవిష్కరణ ద్వారా శాశ్వత కీర్తి సాధించారు. ఆమె ఆవిష్కరణను నేటికీ మొబైల్ ఫోన్లలో ఉపయోగిస్తున్నారు. బహుముఖ ప్రతిభ కలిగిన ఇలాంటి వ్యక్తుల నుంచి మనం ప్రేరణ పొందాలి. మనలో ప్రతి ఒక్కరిలో మార్గదర్శక ఆలోచనలు కలిగిన ఆవిష్కర్తలు ఉన్నారనడంలో సందేహమే లేదు. మనం మనలోని భావాలకు ఒక మార్గం కల్పించి, ఎన్ని ఇబ్బందులు ఎదురైనప్పటికీ అలాంటి ఆలోచనలకు ఊతం కల్పిస్తుండాలి.

మేము ప్రారంభించిన మొబిసోడ్స్, ఆడియోకథలకు చక్కటి ప్రోత్సాహం లభిస్తున్నది. మీరు కూడా వీటిని విని మీ అమూల్య అభిప్రాయాలను మాకు పంపవలసిందిగా అభ్యర్థిస్తున్నాము.

– సంపాదకులు





# పాఠకుల లేఖలు



సెప్టెంబర్ సంచిక సకాలంలో అందటం మహదానందంగా ఉంది. ఈ సంచికను మినహాయిస్తే, ఇంతవరకు చందమామ సుదీర్ఘ చరిత్రలో ముఖచిత్ర వివరణ, -వినాయకుడు- చిత్రకారుని ప్రతిభ గురించి ఎప్పుడూ విశ్లేషించలేదు. వడ్డాది పాపయ్య గారు చందమామకు జీవనాడి. అలాగే నేడు కూడా కథోచిత చిత్రాలు అందిస్తున్న సీనియర్ చిత్రకారులు శంకర్ -కె.సి. శివశంకరన్- గారికి పెద్ద పీట వేసి గౌరవించాలి. పాత కొత్తల మేలుకలయికతో చందమామ చల్లని కిరణాలతో పరవశించని పాఠకుడు ఉండడంటే అతిశయోక్తి కానేరదు. ఆబాలగోపాలాన్ని హిమశీకరాలతో షష్ఠిపూర్తి దాటినా అందాల చందమామ అలరించడం ఎంత చిత్రం! వంద ఏళ్ళు చదవాలనే పాఠకుల ఆశ ఎంత విచిత్రం!! ఇది దురాశ కాదెంతమాత్రం. ఇది మీకు నా శాశ్వత శుభప్రశంస. *– బి. రాజేశ్వరమూర్తి, చిలకలపూడి, కృష్ణా జిల్లా*

సెప్టెంబర్ చందమామను ఆగస్ట్ 27నే అందుకున్నాను. వపాగారి వినాయక చవితి ముఖచిత్రం అద్భుతంగా ఉంది. చందమామకు పూర్వ వైభవం వచ్చినట్టుంది. లోపలి కథలు కూడా చాలా బాగున్నాయి. *– ఆరుపల్లి గోవిందరాజులు, విశాఖపట్నం*

ఇటీవలి చందమామ సంచిక మా కుటుంబ సభ్యుల్నీ, మా స్నేహితుల్నీ ఆశ్చర్యానందాల్లో ముంచెత్తింది. మరీ అంతలా కథలు ఒక దానితో ఒకటి పోటీ పడి అలరించాయి. పైగా ధారావాహికలతో కలిపి పందొమ్మిది కథలు ప్రచురించారు. సంతృప్తినిచ్చింది. ఇక ముందు కూడా ఇదే పద్ధతి కొనసాగించండి. సరదా శీర్షిక నవ్వుల పువ్వులు తొలగించి మరో కథ వేయండి. ఓ చక్కని పౌరాణిక సీరియల్ కూడా వేయండి. *– ఎస్.ఎస్.వి.ఎల్.ఆర్.సి. మహర్షి, పాల్మకోల్, రంగారెడ్డి జిల్లా, ఎ.పి.*

చందమామ జ్ఞాపకాలు చాలా బాగున్నాయి. 'చందమామను ఒకసారి చదవండి. తర్వాత దాన్ని వదలరు' అన్న దుమాల్ గారి వాఖ్య అద్భుతం. వాస్తవం కూడా. అలాగే సెప్టెంబర్ సంచికలోని జ్ఞాపకాలలో 'బతికినంతకాలం చందమామ చదువుతూనే ఉంటాను' అంటూ సోమశంకర్ గారు చేసిన ప్రకటన చందమామ పాఠకులందరి అభిప్రాయాన్ని సూచిస్తోంది. చందమామ చరిత్రను తడుముతున్న జ్ఞాపకాలను శీర్షికగా కొనసాగించడం చాలాబాగుంది.
*– ఎ. నారాయణరావు, అనంతపురం, ఎ.పి.*

గత 20 ఏళ్లనుంచి చందమామ పత్రికను కొని చదువుతున్నాను. నా వయస్సు ఇప్పుడు 23 ఏళ్లు. చందమామ కవర్‌పై వచ్చే వపా చిత్రాలంటే నాకు చాలా ఇష్టం. వపా చిత్రాల కోసం కథల కోసం చందమామ కొని, చదివి, భద్రపరుస్తున్నాను. 60 ఏళ్ల నాటి వపా చిత్రాలు కవర్ పేజీపై చూడాలని ఉంది. కవర్ పేజీపై వపాగారి పాత చిత్రాలే వేయగలరు. చందమామ చివరి అట్టపై కూడా మీరు కోరిన చిత్రం పేరిట వపాగారి చిత్రం ప్రచురిస్తే బాగుంటుంది. వపా చిత్రాలతోటే పెయింటింగ్ బుక్ ప్రచురించగలరు. *– ఎస్. మాధవరావు, దబరు, శ్రీకాకుళం*

స్వాతంత్ర్య దినోత్సవం, రక్షాబంధన్ ఒకే సమయంలో రావడం బాగుంది. చందమామ కథలో నోరు లేని ప్రాణులు తోటి ప్రాణులకు సహాయం చేయడం వింతగొల్పుతోంది. దేశ సుభిక్షానికి వనపెంపకాలు అవసరమన్న సాధువు మాట విన్న రాజు దేశ పూర్వ వైభవానికి పాటు పడటం బాగుంది. చందమామ ముఖచిత్రం 'రెక్కల గుర్రం' ఆకట్టుకుంది. చందమామ కాగితం ముతగ్గా

ఉన్నప్పటికీ ముఖచిత్రం మాత్రం బాగుంది. పాతశైలిలోని కథలు పాత కాలాన్ని గుర్తు చేస్తున్నాయి. క్విజ్ విధానం మార్చండి. *– వాస్తు రామచంద్ర, రాంజీనగర్, నెల్లూరు, ఏపి*

**చం**దమామలో అన్ని కథలూ బాగుంటున్నాయి. ముఖ్యంగా మీరు ప్రచురిస్తున్న పౌరాణిక కథలను చదవడం ద్వారా పురాణాల పట్ల మా జ్ఞానాన్ని పెంచుకోగలుగుతున్నాము. నాకు సుడోకు పజిల్ అంటే చాలా ఇష్టం. దాన్ని కూడా ఇటీవల మీరు ఆపివేయడంతో బాధేసింది. దీన్ని మళ్లీ మీరు ప్రచురించగలరు. 12 భాషల పదాలను పరిచయం చేయడం కూడా చాలా బాగుంది. ఉపయోగం ఉన్న అన్ని అంశాలను ప్రచురిస్తున్నందుకు మీకు కృతజ్ఞతలు. చందమామ కలకాలం వర్ధిల్లుగాక. *– ఎస్. గీతాంజలి, బెంగళూరు*

**చం**దమామ పిల్లల అభిమానపత్రిక. అన్నిటికంటే గొప్ప విషయం ఏమిటంటే ఇది అనేక భాషల్లో లభ్యమవుతూండటమే. అంతేకాదు. ఇది భారతదేశంలోని అతి ప్రాచీన పత్రికలలో ఒకటి. దీని కథలు సాధారణ శైలిలో ఉండటమే కాకుండా హృదయాన్ని స్పందింపజేస్తాయి. ఈ అపురూప పిల్లల పత్రికను జీవితాంతం చదువుతుంటానని, చదివి ఆనందిస్తూనే ఉంటానని నమ్మకంగా చెప్పగలను. *– శుభదీప్, జార్ఖండ్*

**చం**దమామకు నేను నిత్యపాఠకుణ్ణి. అత్యుత్తమ పత్రికలలో చందమామ ఒకటి. జీవితానికి ఉపయోగపడే అనేక నీతిసూత్రాలను నేను చందమామ ద్వారా నేర్చుకున్నాను. చందమామ కథలు నిజంగా అద్భుతమైనవి. అందుకే దాన్ని నేను ప్రేమిస్తున్నాను. చందమామను విడవకుండా చదువుతూనే ఉంటాను. *– రాకేష్ పాల, భద్రక్, ఒరిస్సా*

**పం**డుగ రోజులు రాబోతున్నాయంటేనే నాకు చందమామ గుర్తుకొస్తూ ఉంటుంది. పలు బెంగాలీ పత్రికలు దీపావళి ప్రత్యేక సంచికలను తీసుకొస్తుంటాయి. వాటిని నేను చదువుతుంటాను కూడా. కాని, దీపావళి సంచిక... అంటే ఈ అక్టోబర్ చందమామ సంచిక పండుగ రోజుల్లో భారతీయులందరినీ  ఉత్తేజపరిచేలా ఉంటోందని శషభిషలు లేకుండా చెబుతున్నాను. ఈ నెల ఆకర్షణీయమైన, ఆద్భుతమైన చందమామ ముఖచిత్రం నన్నెంతగానో ఆకట్టుకుంది. ఈ పండుగ మనందరికీ మంచి వార్తలను మోసుకురావాలి, చందమామ కథలు ఎప్పటిలాగే మన హృదయాలలో ఆనంద తరంగాలను ప్రసరింపజేయాలి. పండుగ సందర్భంగా నేను ఇలాగే ప్రార్థిస్తున్నాను. మీ అందరికీ దీపావళి శుభాకాంక్షలు, శుభాభివందనలు.

*– దేబశిష్ ఘోష్, ఆనందపురి, బ్యారక్‌పూర్, కొల్‌కతా–700122*

సెప్టెంబర్ చందమామ వినాయకుడి ముఖచిత్రంతో అబ్బురమనిపించింది. వపాగారి మార్కు ముఖచిత్రాల్లో ఇది హైలెట్. అలాగే ఈ నెల బేతాళ కథలో కొట్టొచ్చినట్లు కనిపించిన మార్పు ఏమంటే శంకర్ గారు పూర్తి పేజీ బొమ్మ వేయడం. బేతాళ కథకు ఫుల్ పేజీ బొమ్మ వేయడం చందమామ చరిత్రలో ఇదే తొలిసారేమో. రాజు, గుర్రం, పాముని శంకర్ పూర్తి పేజీలో అందంగా చిత్రించారు. కథ కూడా బాగుంది. *– సారయ్య, కరీంనగర్, ఎ.పి.*

పిజ్జాల గురించి మాకు తెలియని ఎన్నో విషయాలను తెలుసుకున్నాము. దయచేసి బొమ్మల విషయంలో జాగ్రత్త వహించండి. ప్రస్తుత చందమామలో లోపం ఉందంటే అది బొమ్మల విషయంలోనే. కాగితం నాణ్యత కూడా చాలా తక్కువగా ఉంది. క్విజ్‌లో కూడా తేలికపాటి క్విజ్‌లను ప్రవేశపెట్టండి. ఇవి పిల్లలను, పెద్దలను కూడా ఆకట్టుకుంటాయి. కొత్త కథలను ప్రోత్సహించడం చాలా బాగుంది. *– జి. జాన్ కెన్నడీ, ఘటకేశ్వర్, రంగారెడ్డి జిల్లా, ఎ.పి.*

Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamamashop.com & subscribe Now!!**



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..............................................................................

Date of Birth: .................................. Sex :...................................

Address: ..........................................................................

..........................................................................................

..........................................................................................

....................................................... City: .........................................

State:......................................... Pin:..............................................

Telephone:........................................................................

Mobile:............................................................................

Email:.............................................................................

Subscription Number (for renewals):..........................................

Gift Subscription to the following address:

..........................................................................................

..........................................................................................

..........................................................................................

..........................................................................................

Enclosed Cheque/DD* for Rupees.................................................

Cheque/DD No ..................................................................

favouring Chandamama India Ltd on.........................................

...........................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| **You Save** | | **Rs. 60** | **Rs. 135** | **Rs. 240** | **Rs. 375** |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| **You Save** | | **Rs. 50** | **Rs. 110** | **Rs. 190** | **Rs. 300** |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| **You Save** | | **Rs. 35** | **Rs. 80** | **Rs. 145** | **Rs. 225** |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# చందమామతో నా జ్ఞాపకాలు - 1

నా పెళ్ళిరోజైన 1950 మే 10న చందమామతో పరిచయం ఏర్పడింది. ఆ రోజు మా బావమరిది ప్రొఫెసర్ శర్మ లండన్ నుంచి ప్రత్యేకంగా వచ్చి నాకు ఒక ఇంగ్లీష్ నవలతో పాటు చందమామ పత్రిక ఇచ్చాడు. చదివిన తర్వాత నేను 1947 జూలైలో ప్రారంభ సంచికనుంచి 1950 వరకు పాత సంచికలను విజయవాడ పేవ్‌మెంట్లపై కొని బైండ్ చేయించాను. అప్పటినుంచి ఈ రోజువరకు కొన్ని అణాలతో మొదలు పెట్టి, ప్రస్తుతం ఉన్న రూ. 20ల ధర వరకు పెరిగిన చందమామ పత్రికను నా పుత్రికా సమానంగా భావించి, అపురూపంగా చదువుతున్నాను.

శ్రీయుతులు నాగిరెడ్డి, చక్రపాణి గార్లు బీజం వేసి పెంచి పోషించిన ఈ మొలక క్రమేణా మహా వటవృక్షమై దేశదేశాల్లో శాఖలు విస్తరించి, రాష్ట్రపతులు, ముఖ్యమంత్రుల ఆశీస్సులు పొందగలిగింది. అప్పటి మదరాసు కొడంబాకంలో ఉన్న చందమామ ఆఫీసును సందర్శించి తన్మయత్వం పొందాను. అప్పుడే విజయా స్టూడియో ప్రాంగణంలో ఉన్న పోకచెట్ల పక్క నించున్న మధుర గాయకుడు ఘంటసాలతో పరిచయమైంది.



Name: B.Rajeswaramurthy
Occupation: Rtd. Sub Registrar, Krishna (Dist)

ఈనాడు డైలీ అనుబంధం 12-11-2006లో చందమామ కథ పుట్టుపూర్వోత్తరాలపై నాలుగు నిండు పేజీల వ్యాసంలో నా పేరు ఉదహరించి 76 సంవత్సరాల వయసులో కూడా చదువుతున్నారని రాశారు. మార్చి 2011 సంచికలో నా లేఖకు స్పందనగా చందమామ యాజమాన్యం నన్ను శతమానం భవతి అని ఆశీర్వదించింది. దేవుడు చల్లగా చూస్తే నేను నా వందోసంవత్సరం కూడా చందమామను చదవగలననే విశ్వాసం ఉంది.

నా భార్య, మా ఆరుగురు పిల్లలకు కూడా చందమామ అంటే మహా ఇష్టం. నా మూడవ అబ్బాయి నిష్టగా 'సుందరకాండ' పారాయణం చేస్తూ, ఆ కాలంలోనే వచ్చిన చందమామలో సుందరకాండ సీరియల్ కూడా చదివేవాడు.

చందమామలో పాలమీగడ వంటి కాగితం వాడటం, చక్కటి రంగుల చిత్రాల వలన పదేళ్లు దాటినా చందమామ పుస్తకం కాంతితో, సొగసుగా ఉంటుంది. చందమామలు నా వారసత్వ ఆస్తిగా నా తదనంతరం, మా అబ్బాయిలు, వారి కుటుంబసభ్యులు, మనుమలు, మనుమరాండ్లు, ముని మనమలు చదివి నీతితో మెలిగి ఆనందిస్తారని భావిస్తున్నాను. ఇప్పటికీ, ఎప్పటికీ చందమామ నా అందాల అపరూప సుందరి, దేవకన్య. ఈ బంధం ఏనాటిదో! చందమామ చేయి దాటితే అంధకారమే. వందరూపాయలు అడిగితే ఇస్తాను కాని చందమామను మాత్రం ఇవ్వను అని నా పిల్లలకు, బంధుమిత్రులకు కూడా నిష్కర్షగా చెప్పేస్తుంటాను.

జానపద కథలనుండి, ఈనాటి హైటెక్ యుగం వరకు వినోద, విజ్ఞాన, విశేషాలు అందిస్తున్న చందమామ గగనసీమలో వెలుగులు జిమ్మే చంద్రుడు ఉన్నంతవరకు శాశ్వతంగా, చిరాయువుగా వర్ధిల్లాలని నా ప్రబల కాంక్ష. శుభంభూయాత్.

# చందమామతో నా జ్ఞాపకాలు – 2

నా చిన్నప్పుడు మా అమ్మ చందమామను చూపించి నన్ను నిద్రపుచ్చేది. కాస్త పెద్దయ్యాక ఆ చందమామనే నా చేతుల్లోకి తీసుకోగలిగాను. ఈ మామ మా రక్తం పంచుకుని పుట్టిన నిజమైన మేనమామకు అభిమానంలో ఏమాత్రం తీసిపోడు!

మా నాన్న సైతం అప్పట్లో చందమామను విడవకుండా చదవటం తరచుగా చూసేవాడిని. ఇది నాకు ఆశ్చర్యం కలిగించేది. ఒక పత్రికను వయసు మళ్ళిన వారు కూడా ఇంత అభిమానించగలరా?

నా ప్రశ్నకు నాన్న ఇలా సమాధానమిచ్చారు. 'చూడు నాయనా, ఇతర పత్రికలలో నీవు కేవలం కథలు మాత్రమే చూడగలవు. కాని చందమామలో నైతిక విలువల బోధన జరుగుతుంది. ఇది ఈరోజుల్లో అరుదైన విషయం. ఏది తప్పు, ఏది ఒప్పు అనే చిక్కు సమస్య తలెత్తినప్పుడు చందమామను చదవడం చాలా అవసరం.'


Name: Arupratan Aich
Place: Hooghly, West Bengal

ఆరోజు నాన్న మాటలు నన్నెంతో ఆకట్టుకున్నాయి. ఆ మాటలలోని నిజం ఈనాటికీ నా హృదయంలో నిలిచిపోయింది. సెలవురోజుల్లో ఎన్నో సాయంత్రాలు చందమామ తోడుగా నేను పెరుగుతూ వచ్చాను. చందమామలోని కథలు, వాటి పాత్రలకు చెందిన బొమ్మలు నా ఊహలను పెంచి పోషించాయి.

ఒకరోజు నేను చందమామను చదువుతుండటం చూసిన నా స్నేహితుడి కుమారుడు నన్నడిగాడు. 'మామయ్యా, నాకు పుస్తకాలు అంటే పట్టదు. టీవీ షోలు, గేమ్‌లు అంటే నాకు చాలా ఇష్టం. పుస్తకాలంటే నీకు ఇంత ఇష్టమెందుకు?' ఆ ప్రశ్నకు నేను సమాధానమిచ్చాను. 'బాగా వండిన వంటను నీవు తినకపోయినట్లయితే దాని రుచి నీకు ఎప్పటికీ అనుభవం కాదు.'

నాకు తెలిసి, చందమామ ఆ సంప్రదాయాన్ని ఈనాటికీ కొనసాగిస్తోంది. పత్రిక అనుకోని సవాళ్ళు, అడ్డంకులూ ఎదుర్కొంటున్నప్పటికీ భూమ్మీద చందమామ శాశ్వతంగా వెలుగొందాలని నేను సదా ప్రార్థిస్తుంటాను.

Request to readers: Contributors of stories, memories are requested to send in their entries with their complete name, address, phone no and other contact details to enable us to get back to you.

Write to us:

**Chandamama India Ltd.,** No:2 Ground Floor,
Swathi Enclave, Amman koil street, Vadapalani, Chennai-600026.
● Phone: 044-43992828 ● Email : online@chandamama.com





# రత్నసెట్టి కథ

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'విక్రమార్క మహారాజా! నువ్వు ధైర్యవంతుడివి, పరాక్రమవంతుడివి. కాని నీ శక్తుల్ని వ్యర్థపరుస్తున్నావేమో? ఏ మహత్తర కార్యం సాధించటానికి నువ్విలా అర్ధరాత్రి శ్రమపడుతున్నావో తెలియడం లేదు కాని, నీ ఉపకారం విలువలేకుండా పోయి రత్నసెట్టి లాగా నువ్వు కూడా అవమానాల పాలవుతావేమో నని అనుమానంగా ఉంది. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఆ కథ విను,' అంటూ ఇలా చెప్పసాగాడు.

ఒకప్పుడు కరూర దేశాన్ని ఉశీనగరం రాజధానిగా ధర్మశీలుడనే మహారాజు పరిపాలించేవాడు. ఆయన పేరుకు తగినట్లే ధర్మశీలుడు, న్యాయవర్తనుడు, శౌర్యవంతుడు, వివేకవంతుడు, రాజనీతిజ్ఞుడు.



సుబుద్ధి ఆయనకు తగిన మంత్రి. రాజుగారి వివేకవంతమైన నిర్ణయాలకు తోడు సుబుద్ధి సమయోచిత సలహాలు కలిసి పరిపాలన ప్రశాంతంగా సాగుతోంది. ప్రజలు సుఖశాంతులతో జీవిస్తున్నారు.

ఆ నగరంలో రత్నసెట్టి అనే వైశ్యప్రముఖుడు రత్నాలు, వజ్రవఢ్యూరాలు, బంగారు ఆభరణాల వ్యాపారంలో కోట్లకి పడగలెత్తాడు. అదీగాక, ఆయనకు తాతముత్తాతలు సంపాదించిన ఆస్తి, ఐశ్వర్యం కలిసి వచ్చాయి.

ఇక ఏ వ్యాపారం చేసినా కలిసివచ్చి మట్టి పట్టుకుంటే బంగారమయింది. అయినా రత్నసెట్టికి గర్వమన్న మాట లేదు. అందరితో సఖ్యంగా ఉంటూ పేదవారికి చేతనైన సాయం చేస్తూ వచ్చాడు.

ఇలా ఉండగా రాజ్యంలో ఒక సంవత్సరం వర్షాలు పడక పంటలు పండలేదు. ధాన్యపు దిగుబడి బాగా తగ్గిపోయింది. కరువు వచ్చింది.

రాజుగారి ధాన్యాగారాలలో నిలవ ఉంచిన ధాన్యమంతా అయిపోయింది. ప్రజలు ఆకలితో అలమటించసాగారు. ఏం చెయ్యటానికి పాలుపోక రాజుగారు ఆందోళన చెందసాగారు. పొరుగు రాజును అర్థించినా ప్రయోజనం లేకపోయింది. ఆ సమయంలో రత్న సెట్టి తన మిత్రుడైన వసుసెట్టి సహాయంతో దూరదేశాల నుండి ధాన్యం కొని బళ్ల మీద తెప్పించి, ప్రజలకు చౌకధరలకు అందజేశాడు. కొందరు పేదలకు ఉచితంగా పంచాడు.

దీంతో ప్రజలకు ఆహార సమస్య తీరిపోయింది. రాజుగారు ప్రత్యేకంగా సభలో రత్నసెట్టిని ప్రశంసించి, సత్కరించారు.

కొన్నాళ్ళు గడిచాయి. ఉన్నట్లుండి రాజ్యంలో వింత వ్యాధి ప్రబలింది. ప్రజలు దానిబారిన పడి బాధపడసాగారు.

రాజుగారి వైద్యశాలలు రోగులతో నిండిపోతున్నాయి. వైద్యులిస్తున్న నేత్ర లేపనం ఏమీ పనిచేయడం లేదు. వైద్య శాలలు చాలటం లేదు. మళ్లీ రత్నసెట్టి పూనుకొని తన తండ్రి నిర్మించిన వైద్యశాలలకు నిపుణులైన వైద్యులను రప్పించి ఔషధాలను తెప్పించి, ఉచితంగా చికిత్స చేయించాడు.

కొంతకాలానికి వ్యాధి తగ్గిపోయింది. రాజుగారు సభలో రత్నసెట్టిని ప్రశంసిం

చటమే గాక, నగరప్రముఖుడిగా గుర్తిస్తూ, ఒక బిరుదును కూడా ఇచ్చి, కనకధ్వజము, ఛత్రచామరాలు బహూకరించారు.

ఆ సంవత్సరం రత్నసెట్టి నగలకు స్వదేశంలోను, విదేశాలలోను బాగా గిరాకీ హెచ్చింది. విపరీతంగా లాభాలు వచ్చాయి.

రత్నసెట్టి తమ రాజ్యంలో గ్రామ గ్రామాన ప్రధాన నగరాలలో, తన తండ్రి పేర భోజన శాలలు ఏర్పరిచాడు. ఎవరు, ఏ సమయంలో భోజనశాలల వద్దకు వచ్చినా వారందరికీ ఉచిత భోజన సదుపాయం కల్పించాడు. అవి రానుకాను ధర్మశాలలుగా ప్రసిద్ధి చెందాయి.

ప్రజలు రత్న సెట్టి వితరణను శ్లాఘించారు. ఈ సంగతి తెలుసుకున్న రాజుగారు రత్నసెట్టిని పిలిపించారు.

రత్నసెట్టి రాగానే, అక్కడే ఉన్న మంత్రి ఆసనం చూపించి, 'భోజనశాలలు నడుపుతున్నావట. ఆదాయం బాగా ఉందన్న మాట. పన్ను చెల్లించావా?' అని అడిగాడు.

రత్నసెట్టి తడుముకోకుండా 'నా ఆదాయపు వివరాలను గడువుకు ముందే తమ కార్యాలయంలో సమర్పించి పన్ను చెల్లించాను ప్రభూ. భోజనశాలలను, నాకు పూర్వీకుల నుంచి సంక్రమించిన ఆస్తులమీద వచ్చిన రాబడితో నిర్వహిస్తున్నాను. ఆ రాబడి మీద పన్ను చెల్లించవలసిన అవసరం లేదు' అన్నాడు వినయంగా.

'కాదు. కొత్తశాసనం ప్రకారం పన్ను చెల్లించవలసి ఉంది,' అంటూ కోశాగారంలో ఆదాయ వ్యవహారాలను చూసే కరణాన్ని పిలిపించి లెక్క వేయించాడు.





కరణం చెప్పిన మొత్తం విని రత్నసెట్టికి మతిపోయింది.

'నాకు వచ్చిన ఆస్తి మీద రాబడి కన్నా రెట్టింపు పన్ను కట్టవలసి వస్తుంది మహా రాజా! అంత చెల్లిస్తే భోజనశాలలు న నిర్వహించలేను.' అన్నాడు దీనంగా రత్న సెట్టి.

'అయితే మరీ మంచిది. వాటిని నిక్షే పంగా మాపరం చెయ్యి. ఇకనుంచి భోజన శాలలను మేమే నిర్వహించగలము,' అన్నాడు మహారాజు.

'ప్రభూ!' అంటూ రత్న సెట్టి ఏదో చెప్ప బోయాడు కాని రాజు వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు. దిగాలుపడి నిలబడిపో యిన రత్నసెట్టితో మంత్రి సుబుద్ధి భుజం తడుముతూ, 'విచారించకు అవి నీ తండ్రి పేరనే నడుపబడతాయి.' అని ఓదార్చాడు. చేసేది లేక రత్నసెట్టి భోజనశాలలన్నీ భవ నాలతో సహా రాజుగారి పరం చేస్తున్నట్లు పత్రం రాసి వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన మరునాడు రాజుగారి తర పునసభాపతి ప్రజలముందు ఇలా ప్రకటన చేశాడు.

'ధర్మశాలలో ఇకనుండి కేవలం వికలాం గులకు మాత్రమే భోజన సదుపాయం ఉంటుంది.'

ప్రజలు రాజుగారిని ఒక్కసారిగా తిట్టు కున్నారు. కానీ రాజు ఏమాత్రం లెక్కచేయ లేదు.

కొంతకాలం గడిచింది.

ఒకరోజు సాయంకాలం రాజుగారు, మంత్రి మాట్లాడుకుంటున్న సమయంలో ధర్మయ్య అనే వృద్ధుడు వచ్చాడు.

ఎందుకు వచ్చావు? అని మంత్రి అత డిని ప్రశ్నించాడు.

ధర్మయ్య ఇలా చెప్పాడు.

'నన్ను ధర్మయ్య అంటారు ప్రభూ! నేను తమ దేశపౌరుడిని. తమ కొలువులో పనిచేసి పదవీ విరమణ చేశాను. నాకు వచ్చే వేతనంతో నా ఇద్దరు కొడుకులను పెంచి పెద్ద చేశాను.

గురుకులంతో విద్యాబుద్ధులు చెప్పిం చాను. కుమార్తెకు వివాహం చేశాను. ఇప్పుడు వృద్ధుడినయ్యాను. నాలో శక్తి తగ్గి పోయింది. కొడుకుల దగ్గరకు చేరాను. కాని వారు నన్ను పోషించలేమంటున్నారు.'

‘ఎందుకు పోషించలేరు?’ అని రాజు అడిగాడు.

‘మీరే అడగండి. వారు మీ కొలువులోనే ఉన్నారు.’

రాజు ధర్మయ్య కొడుకులను పిలిపించి జరిగిన ఘటనలను విచారించాడు.

ధర్మయ్య కొడుకులు, ‘‘ఏం చేయగలం మహారాజా? మా సంసారాలు పెద్దవి. మాకు వచ్చే వేతనం సరిపోవడం లేదు, మేం బతకాలంటే కూడా అప్పు చేయవలసి వస్తున్నది,’ అన్నారు.

రాజు దీని గురించి విచారించిన మీదట, వారు నిజమే చెప్పారని తెలిసింది.

రాజు కాసేపు ఆలోచించి ధర్మయ్యతో రత్నసెట్టిని కలవమన్నాడు. ధర్మయ్య చెప్పినదంతా విన్న రత్నశెట్టి, ‘అయితే నీ కొడుకులను నా దగ్గర పనిచేయమను. అక్కడ వేతనం కన్నా రెట్టింపు ఇస్తాను. అదీ నిన్ను పోషించే షరతు మీద,’ అన్నాడు.

ధర్మయ్య కొడుకులు ఈ ప్రతిపాదనకు సంతోషంగా ఒప్పుకున్నారు. ఆ తర్వాత ధర్మయ్య తనవంతుగా రాజుగారిని కలిసి ధన్యవాదాలు తెలిపి వెళ్లిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి,

‘విక్రమార్క మహారాజా, నాకు ధర్మశీలుడి ప్రవర్తన మీద అనుమానం కలుగుతున్నది. రాజ్యానికి అంత ఉపకారం చేసిన రత్నశెట్టిని ప్రశంసిస్తూనే, మళ్లీ భోజనశాలల నిర్వహణ తాను స్వీకరించటమేమిటి? రత్నశెట్టి పట్ల కృతఘ్నతతో వ్యవ



హరించిన రాజు మళ్ళీ స్వయంగా ధర్మయ్యను రత్నశెట్టి వద్దకు పంపటమేమిటి? వివేకి అని ప్రసిద్ధి చెందిన రాజు అవివేకంగా ప్రవర్తించటమేమిటి? ఈ ప్రశ్నకు తెలిసి సమాధానం చెప్పకపోయావో నీ తల నూరు వక్కలై పగిలిపోతుంది,’ అన్నాడు.

విక్రమార్కుడు ఆలోచించి, ‘ఇందులో అనుచితమేమీలేదు. ధర్మశీలుడికి ప్రజాక్షేమం ముఖ్యం. అందుకే కరువు వచ్చినప్పుడు వ్యాధి ప్రబలినప్పుడు రత్న శెట్టి చేసిన ఆ సహాయాన్ని ప్రశంసించాడు. కాని రత్నశెట్టి కరువు కాలంలో భోజనశాలలు ఏర్పరిచే ముందు రాజుగారిని సంప్రదిస్తే బాగుండేది.

రోజూ ఉచితంగా భోజనం లభిస్తుంటే ఎవరు మాత్రం కష్టపడి పనిచేస్తారు? రైతు

పండిస్తేనే ధాన్యం లభిస్తుంది. సాలీలు నేస్తేనే వస్త్రాలు తయారవుతాయి.

రత్నశెట్టి ఏ పనీ చేయకుండానే కడుపు నిండా భోజనం పెడుతుంటే యువకులకు కూడా కష్టపడవలసిన అవసరం, సంపాదించుకోవలసిన అవసరం కాని ఉండదు. రాజ్యంలో శ్రమశక్తికి విలువ ఉండదు.

ప్రజలు ముఖ్యంగా చదువుకున్న యువకులు సోమరులై పోతారు. దానితో ఉత్పత్తి మందగిస్తుంది. దేశంలో అభివృద్ధి, సంక్షేమం జరగవు. యువశక్తి నిర్వీర్యమైపోతుంది. వారి మేధాశక్తి మొద్దుబారిపోతుంది.

రాజ్యంలో అన్ని వృత్తులవారు సహజీవనం చేస్తూ తమ తమ వృత్తులలో రాణించగలిగితేనే రాజ్యం సుసంపన్నంగాను సుభిక్షంగాను ఉంటుంది.

కొందరు తమ బుద్ధిచాతుర్యాన్ని ఉపయోగిస్తారు. కొందరు శారీరక శ్రమ పడతారు. ఏదైన వక్రమార్గ పట్టనంత వరకు వారికి తగిన గుర్తింపు ఉంటుంది.

రాజైనవాడు వారిని ప్రోత్సహిస్తూ, వారి స్వశక్తితో వారి కాళ్లమీద వారు నిలబడగలిగే ధైర్యాన్ని. బలాన్ని ఇవ్వాలి. అందుకే రాజు ఆ విధంగా ప్రవర్తించాడు. ఇది రాజు తీసుకున్న మంచి నిర్ణయం.

ఇక ధర్మయ్య విషయానికి వస్తే రాజు తనకు తానుగా ధర్మయ్య కొడుకులకు వేతనం పెంచలేడు. అది ఒక వ్యవస్థ. రత్నశెట్టి ఉదారుడని తెలిసే ధర్మయ్యని అతని వద్దకు పంపి సమస్యను పరిష్కరించాడు.

రాజు ధర్మశీలుడు వివేకి. పరిపాలనా దక్షుడనటంలో ఎటువంటి సందేహం లేదు.'

విక్రమార్కుడికి ఈవిధంగా మౌన భంగం కాగానే బేతాళుడు తిరిగి శవంతో సహా చెట్టెక్కాడు.

– కల్పితం
(ఆధారం: ఎస్. ఎస్. ఆర్ మూర్తి)





# ఫలించిన తీర్థయాత్ర

ఒకరోజు పాపన్న నివసించే గ్రామానికి లింగయ్య అనే శివభక్తుడు వచ్చాడు. లింగయ్య రాకను గురించి విన్న పాపన్న అతన్ని తన ఇంటికి ఆహ్వానించి, భోజనం పెట్టి కుశలప్రశ్నలు వేశాడు.

లింగయ్య తానొక శివభక్తుణ్ణనీ, తుంగభద్ర తీరాన కొత్తగా నిర్మించిన ఒక ఆశ్రమాన్ని దర్శించటానికి వెళుతున్నాననీ, అక్కడొక శివాలయంకూడా వెలిసిందనీ చెప్పాడు. పాపన్న తనకుకూడా అటువంటి తీర్థయాత్రలు చెయ్యాలని ఉన్నప్పటికీ వ్యవధి లేనందువల్లనే అది వీలవటంలేదనీ చెప్పుకుని బాధపడ్డాడు.

పరుల క్షేమం కోసం మీరు చేస్తున్నవన్నీ ఉత్తమలోకాలు పొందడానికే కదా? అది దేవుణ్ణి నమ్ముకుంటే మరింత సులువుగా జరిగేపని అని మరవకండి. మీరు ఒంటరిగా ప్రయాణించనవసరంలేదు. నావంటి వాడి వెంట రావడమే మేలు. ఒకరికొకరం తోడుగా ఉంటాము. ఖర్చులు కూడా కాస్త తగ్గుతాయి.' అన్నాడు లింగయ్య.

ఇరుగుపొరుగువాళ్ళుకూడా లింగయ్య యోచనను బలపరిచి పాపన్నను ప్రోత్సహించారు. వారందరి మాటా కాదనలేక పాపన్న మూటాముల్లె సద్దుకుని లింగయ్యతో బాటు ప్రయాణం మొదలుపెట్టాడు.

అయితే పాపన్నకు లింగయ్య పరమ లోభి అని త్వరలోనే అర్థమయింది. అతను ఎవరికీ చిన్నమెత్తు సహాయం చెయ్యకపోగా తన వెంట తనకోసం తెచ్చుకున్న తిండి కూడా పాపన్నతో పంచుకోలేదు. పాపన్న మాత్రం దారిన కనిపించిన బిచ్చగాళ్ళకూ, బీదసాదలకే కాక తన వెంటపడే కుక్కలకూ, అడవిలోని కోతులకూ కూడా తిండి పెడుతూ వచ్చాడు. ఆ కారణంగా ఒక్కొక్కప్పుడు భోజనం వేళకు పాపన్న వద్ద తినడానికేమీ

కొడవటిగంటి రోహిణీ ప్రసాద్



మిగిలేది కాదు. లింగయ్య పాపన్నను తప్పు పట్టాడే కాని తన తినుబండారాలను తిన నివ్వలేదు. అందుచేత పాపన్న అడవిలో దొరికే ఫలాలతో కడుపు నింపుకుని, అవ తలి గ్రామం చేరుకునేదాకా ఆహారం లేకుం డానే గడుపుకోవలసి వచ్చింది.

ఆకలితో నీరసించి త్వరగా నడవలేకపో తున్న పాపన్నను చూసి లింగయ్య విసుక్కో సాగాడు. 'తనకు మాలిన ధర్మం చేటు చేస్తుంది పాపన్నగారూ! మనమింకా చాలా దూరం పోవాలి. ఇలా అయితే అనుకున్న సమయానికి మనం గమ్యస్థానానికి చేరుకో లేము' అని హెచ్చరించసాగాడు.

లింగయ్య ధోరణిలో మాత్రం మార్పేమీ కలగలేదు. నడవలేక నీరసంతో కూలబడిన పాపన్నతో అతను తగవు పెట్టుకున్నాడు. 'నేనెంత చెప్పినా మీరు అయినవాళ్ళకీ, కాని వాళ్ళకీ దానాలు చెయ్యడం మానుకోరు. ఇలా అయితే మీతో నడవడం నాకిక సాధ్యం కాదు. నేను త్వరగా కాలు సాగిస్తాను'. పాప న్నకు కూడా ఇబ్బందిగా అనిపించింది. 'మీకు కాలయాపన అవుతున్నట్టుంది. మీరు ముందుకు సాగండి. నేను కాస్త వెనకగా వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను' అని పాపన్న అనడంతో లింగయ్య అతన్ని వదిలి పెట్టి తన దారిన తాను వెళ్ళాడు.

అయితే ఒంటరివాడైన లింగయ్యకు త్వరలోనే కష్టాలు కలిగాయి. పాపన్నవంటి బలాఢ్యుడు వెంట లేకపోవడం, కరువు ప్రాంతంలో ధనమూ, ఆహారమూ కలిగి ఉండడం లింగయ్యకు ముప్పులు తెచ్చి పెట్టాయి. దారిదోపిడీలు చేసే ముఠాలు ఎదురవడంతో త్వరలోనే అతను ఉన్నవన్నీ కోల్పోయాడు.

అటు పాపన్న పరిస్థితి కూడా విషమిం చింది. తినడానికీ, తాగడానికీ ఏమీ లేని పరిస్థితిలో ఒకరోజున మిట్టమధ్యాహ్నపు ఎండదెబ్బకు అతను దారిలోనే స్పృహతప్పి పడిపోయాడు. అటుగా వెళుతున్న ఇద్దరు సాధువులు అతన్ని దగ్గరలో ఉన్న తమ ఆశ్ర మానికి తీసుకెళ్ళారు. అక్కడ సేద తీరిన తరవాత పాపన్నకు వారి గురించి తెలిసింది.

ఆ సాధువులిద్దరూ సోదరులు. ఎవరి తోనూ సంబంధం లేకుండా ఒక కుటీరం నిర్మించుకుని జీవిస్తున్నారు. సమీపంలోని చిట్టడవే వారికి అవసరమైనవాటన్నిటినీ సమకూరుస్తుంది.

మెల్లగా పాపన్నకు వారి జీవనశైలి అర్థమ యింది. తాను అక్కడ ఆహారంగా తిన్న

కొత్తరకం దుంప గురించి పాపన్న ఆరా తీశాడు. తినడానికి చిలగడదుంపలాగే ఉన్నప్పటికీ ఆ మొక్కలు ఎక్కువ నీటి సరఫరా లేకుండానే ఆ అడవిలో సులువుగా పెరుగుతాయనీ, వాటి ఆకులు కూడా తోటకూరలాగే తినడానికి రుచిగా ఉంటాయనీ అతను తెలుసుకున్నాడు. బ్రహ్మజెముడు వంటి మరొకజాతి మొక్క కూడా అతని కంట పడింది. వాటి మట్టలను విరిచినప్పుడు అందులోని స్వచ్ఛమైన నీరు తాగడానికి పనికొస్తుందనీ, మంచినీరు దొరకని పరిస్థితిలో అది మనుషుల ప్రాణాలు కాపాడగలదనీ అతనికి అర్థమయింది. ఆ సాధువులు ప్రకృతితో కలిసిమెలిసి సహజీవనం చేస్తున్నట్టుగా పాపన్నకు అనిపించింది. వారం రోజులు గడిచాక వారి సహాయానికీ, ఆతిథ్యానికీ కృతజ్ఞత తెలుపుకుని పాపన్న మళ్ళీ కాలిబాట పట్టాడు.

ఆ మర్నాడే అతనికి గుర్రంమీద వేగంగా వెళుతున్న ఒక రౌతు కనిపించాడు. చాలా ఏళ్ళ క్రితం రాజసన్మానానికై పాపన్నకు ఆహ్వానం అందించిన రౌతు అతనే. అతనిప్పుడు పాపన్నను గుర్తించి, గుర్రం దిగి గౌరవంతో నమస్కరించాడు. తాను దగ్గరలోనే ఉన్న ఒక సంస్థానాధీశుడి వద్దకు ఏదో లేఖ అందించడానికి వెళుతున్నాననీ, పాపన్నకు సహాయం అందించమని ఆ సంస్థానాధీశుణ్ణి కోరుతాననీ అతను చెప్పాడు.

త్వరలోనే పాపన్న కోసం ఒక పల్లకీ, దాన్ని మోస్తున్న నలుగురు బోయీలూ వచ్చేశారు. పాపన్న వారితో సంస్థానానికి వెళ్ళాడు. పాపన్నను గురించి తెలుసుకున్న ఆ రాజు



అతడికి తగిన అతిథిసత్కారాలు చేశాడు. పాపన్న ఒకటి రెండు రోజులు సభాకార్యక్రమాలలో కూడా పాల్గొన్నాడు.

ఆ రాజ్యవాసులకు తిండి, నీరు ప్రధాన సమస్యలు. సారంలేని నేలలో పంటలు పండటంలేదు. రాజుకూడా వారికి సహాయం చెయ్యలేక, శిస్తులుకూడా రాబట్టలేని పరిస్థితిలో ఉన్నాడు. ఒకరోజు సభలో పాపన్న లేచి నిలబడి ఇలా అన్నాడు.

'రాజా! మీ ప్రాంతంలోఉన్న అడవి దుంపలు నీటి ఎద్దడి ఉన్న ప్రదేశాల్లో కూడా సులువుగా పెరుగుతాయి. వీటివల్ల మంచి పౌష్టికాహారం అందరికీ చవకగా లభిస్తుంది. ఈ రెండో మొక్కవల్ల నీరుకూడా లభ్యమవుతుంది' అంటూ పాపన్న తన మూటలోని దుంపలనూ, బ్రహ్మజెముడు మట్టలనూ సభికులకు చూపాడు.

రాజుగారి తోటమాలులు వెంటనే ఆ దుంప నొకదాన్ని పాతి అది త్వరలోనే మొలకెత్తే రకమని గుర్తించారు. త్వరలోనే వాటి పెంపకం రాజ్యమంతటా విస్తృతస్థాయిలో మొదలయింది. ఆకలి చావులు తగ్గసాగాయి. రాజుగారు చాలా సంతోషించి పాపన్నకు కానుకలిచ్చి, పౌరసన్మానాలు చేయించారు.

పాపన్న ప్రయాణం తుంగభద్ర ప్రాంతానికని తెలుసుకున్న రాజుగారు అతనికి అశ్వాలను పూన్చిన రథాన్నీ, సామగ్రి మోసుకెళ్ళే బళ్ళనూ, సహాయకసిబ్బందినీ ఇచ్చి సాగనంపారు. పాపన్న పుణ్యక్షేత్రాన్ని దర్శించుకుని, సంస్థానాధీశుడి గౌరవ అతిథిగా, కరువు నివారణకు తోడ్పడినవాడిగా అక్కడ కూడా గౌరవ మర్యాదలనూ పొందాడు.

అయితే అతనెంత వెతికినా లింగయ్య జాడ మాత్రం కనబడలేదు. మరొక రెండు వారాలు గడిచాక లింగయ్య ఒక నిరుపేద జంగాల బృందంతోబాటుగా లింగయ్య ఆ క్షేత్రానికి చేరుకున్నాడు. దొంగల బారిన పడి, ఉన్నదంతా పోగొట్టుకుని, దారి పొడుగునా బిచ్చమెత్తుకుంటూ తిరిగే జంగాల వెంట తానెలా గమ్యస్థానానికి చేరుకున్నదీ లింగయ్య పాపన్నకు చెప్పాడు.

పాపన్న వృత్తాంతాన్ని విన్న లింగయ్య అతనితో 'దేవుడి కోసం తీర్థయాత్రలు చెయ్యడం అనవసరం అనిపిస్తోంది పాపన్న గారూ. మీలాంటివాళ్ళలోనే దేవుడున్నాడు. ఆ సంగతి గుర్తించలేని నేను గుడ్డివాడిలా ప్రవర్తించాను. నేను ఈసడించుకున్న మీ పరోపకారి లక్షణమే మీకు శ్రీరామరక్షలా పనిచేసింది. మీరు వ్యక్తులనే కాక, ఒక కరువుప్రాంతపు ప్రజల సమూహానికే మంచి చెయ్యగలిగారు. మీకెన్ని గౌరవాలు దక్కినా అవి తక్కువే' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. పాపన్న అతణ్ణి ఓదార్చాడు.

పాపన్న పరివారంతో కలిసిపోయిన లింగయ్య తిరుగుప్రయాణం మటుకు సుఖంగా జరిగిపోయింది. స్వంత ఊళ్ళో పాపన్నకు మరింత గౌరవమూ, ప్రతిష్ఠా లభించింది.






# అమూల్యం

సరస్వతీ టీచర్ క్లాసంటే అందరికీ ఇష్టమే. ఎందుకంటే ఆమె విద్యార్థులను నవ్విస్తూ చక్కని ఉదాహరణలతో పాఠం చెబుతుంది.

ఆరోజు... సాంఘికశాస్త్రం పాఠంలో.. ఆమె.. మన కుటుంబాలలో ఆడపిల్లల పట్ల చూపించే వివక్ష గురించి చెప్పి తర్వాత దానిపై పిల్లలచేత కూడా మాట్లాడించింది. అందుకే పిల్లలందరికీ ఆనాటి పాఠం బాగా మనసులకు హత్తుకుపోయింది.

సుమన, శ్రియ, గులాబీ ముగ్గురూ స్నేహితులు. స్కూలు నుంచి ఇంటికి తిరిగి వెళుతున్నా వాళ్ల మనసులు మాత్రం పాఠం నుంచి ఇంకా బయటకు రాలేదు.

'సరస్వతీ టీచర్ చెప్పింది నిజమేనని పిస్తోందే శ్రియా! మన అమ్మానాన్నలకి పక్షపాత బుద్ధి ఉందే,' అంది సుమన.

'ఏమోనే. మనం మన అమ్మానాన్నల గురించి అలా ఆలోచించడం తప్పు కదా!' శ్రియ నెమ్మదిగా నచ్చచెబుతున్నట్లుగా అంది.

గులాబీకి కోపం వచ్చి 'నీకేం మీ ఇంట్లో నువ్వు ఒక్కదానివే పుట్టావు కనుక నువ్వు ఏమడిగినా వెంటనే మీ అమ్మానాన్నా తెచ్చి స్తారు కాని, మా ఇంట్లో అయితే మా అమ్మకి మా అన్నయ్యంటేనే ఎక్కువ ఇష్టం' అంది.

'మా ఇంట్లో అయితే.. చదువు విషయంలో కూడా ఎంత పక్షపాతమో.. లెక్కలు అర్థం కావడం లేదని, నేనెంత గోలపెట్టినా పట్టిం చుకోని మా నాన్నగారు.. మా తమ్ముడిని ఇంజ నీరుని చెయ్యాలని వాడు అడగకుండానే ప్రత్యేక శిక్షణ ఇప్పిస్తున్నారు. అంటే నేను ఆడపిల్లని కనుక డబ్బు ఖర్చు పెట్టకూడద నేగా..' అంది సుమన.

'నువ్వు మరీ చెప్తావే.. నిన్నటిదాకా మీ తమ్ముడు చాలా తెలివైనవాడని మెచ్చుకు న్నావు. నీకు లెక్కలంటే ఇష్టంలేదని కూడా చెప్పావు కదా.. ఇంతలోనే మాట మార్చేస్తే

పి.వి. సత్యనారాయణ



ఎలా?' అంది శ్రియ కుండ బద్దలు కొట్టినట్టుగా. ఆ పిల్లకి తన మిత్రులు అమ్మా నాన్నల ప్రేమను శంకించడం నచ్చలేదు.

'నువ్వెంత చెప్పు.. టీచరు చెప్పినట్టు మన ఇళ్ళల్లో ఆడపిల్లలంటే అందరికీ చులకనే. మా తమ్ముడికి అడిగినా అడక్కపోయినా వందలు ఖర్చుపెట్టి పుస్తకాలు కొనిచ్చే మా అమ్మానాన్నా నా విషయంలో మాత్రం పెద్దగా పట్టించుకోరు. మొన్నటికి మొన్న.. సరదాగా కొత్త చందమామ పుస్తకం కొనుక్కుంటానంటే ఇప్పుడెందుకులే అంటూ కొట్టి పారేశారు.' అంది సుమన రోషంగా.

గులాబీ వెంటనే అందుకుంది. 'అలా చేస్తే నేనయితే కోపం వచ్చి ఆరాత్రి అన్నం తినడం మానేస్తాను. అయినా పట్టించుకుంటేనా? అదే మా అన్నయ్యయితే.. దగ్గరుండి మరీ తినిపిస్తుంది మా మామ్మ..'

అలా అంటున్నప్పుడు అనుకోకుండానే ఉక్రోషంతో ఆ పిల్ల కళ్ళవెంట గిర్రున నీళ్ళు తిరిగాయి. 'ఏమయినా శ్రియా! నువ్వు అదృష్టవంతురాలివి కనుక ఒక్కతెవే పుట్టావు. అందుకే అడిగిందల్లా కొనుక్కోగలుగుతున్నావు,' గులాబీ మాటల్లో రవంత అసూయ తొంగి చూసింది.

'ఏమిటో.. మీరిలా అంటారు కాని.. నాకయితే కలిసి ఆడుకోవడానికి, కబుర్లు చెప్పుకోవడానికి గాని కనీసం పోట్లాడుకోవడానికైనా మీలాగా ఓ అన్నో, తమ్ముడో ఉంటే ఎంత బాగుండును అని బాధపడుతూ ఉంటాను.' అంది శ్రియ నిజాయితీగా.

'అబ్బ పోనిద్దురూ, మనం రోజూలా నవ్వుతూ కబుర్లు చెప్పుకోకుండా అనవసరపు మాటల్లోకి దిగామేమోనే... అదిగో అప్పుడే మా ఇల్లు వచ్చేసింది. మళ్లీ రేపు కలుద్దాం,' అంటూ సుమన వెళ్లిపోయింది.

గులాబీ, సుమన.. ఆ ఇద్దరి ఆడపిల్లల మనస్సుల్లో సరస్వతీ టీచర్ మాటలు బాగా ముద్రవేశాయేమో.. ఇంటికెళ్లాక అమ్మా నాన్నల విషయంలో రోజూ మామూలుగా తీసుకునే విషయాలు కూడా వాళ్లకి ప్రత్యేకంగా కనిపించడం మొదలెట్టాయి...

'మామ్మా.. నీకు గులాబీ అంటేనే ఇష్టం. పెరుగుమీద మీగడంతా దానికేవేసేస్తున్నావు. ఇలా అయితే నేను తిననంతే,' తనను బెదిరిస్తున్న మనవడిని చూసి ముసిముసిగా నవ్వింది.. గులాబీ మామ్మ.

'అలా అన్నం మీద కోపగించకురా గోపాలం.. నా బంగారు తండ్రివి కదూ..! నీకిష్టమైన నెయ్యి నీకు వేసానా లేదా.. అది

నెయ్యి తినదు కనక దానికి మీగడ వేశాను. అయినా మేం ఎల్లకాలం ఉంటామా? ఒక్క గానొక్క చెల్లి. దానిని పువ్వులా ముద్దుగా చూసుకోవలసింది నువ్వే. ఆడపిల్లని చీటికి మాటికీ ఏడిపించావంటే.. చూడు అట్లు కాడ తిరిగేస్తాను. దానికి మా అమ్మ పేరు.. తెలుసా..? అందుకే నేనంటే నా మనవ రాలికి ఎంతో ప్రేమ. నాచేతే జడ వేయించు కుంటుంది. నువ్వు నేను చేసి పెట్టినవన్నీ తినేయడమే గాని నువ్వు తిన్నావా మామ్మా అని నా చిట్టితల్లిలాగా ప్రేమగా ఒక్కనాడ యినా అడిగావా?' అంది మామ్మ.

'అందుకే కాబోలు నేనడిగితే ఓపికలేదం టావు గానీ నీ ముద్దుల మనవరాలికి మాత్రం జంతికలు, కాజాలు చేసిపెడతావు. నీకు నేనంటే ఇష్టంలేదు.' అంటూ గులాబీ అన్నయ్య కొంటెగా నవ్వి పారిపోయాడు. మామ్మకి తనమీద గల అభిమానానికి గులాబీ మనసు చల్లబడినట్లయింది.

సరిగ్గా ఓ వారం తర్వాత తెలుగు మాస్టారు సుందరం మహాభారతం లోని పాఠ్యభాగం.. కుంతీదేవిని చెబుతూ ఇలా అన్నారు.

'అప్పుడేమయిందంటే... పాండవులు ఐదుగురూ భోజనాలకి కూర్చున్నారట్రా.. కుంతీదేవి ఏం చేసిందనుకున్నారు? అన్నం రెండు సమభాగాలుగా చేసింది. ఒక సగ భాగం భీముడికి పెట్టింది. మిగతా సగాన్ని నాలుగు సమభాగాలు చేసి ధర్మరాజు, అర్జు నుడు, నకులుడు, సహదేవుడికీ పెట్టింది. వాళ్లంతా తృప్తిగా తిన్నారు. కాని ఎందు కమ్మా పక్షపాతం చూపిస్తున్నావు? అని ఈ కాలం పిల్లల్లా ఒక్కరూ ఒక్క మాటయినా




అడగలేదు. ఎందుకో ఎవరయినా కారణం చెప్పగలరా?' అడిగారు మాస్టారు.

క్లాసులో పిల్లలు గుసగుసలాడారు తప్ప ఎవరూ సమాధానం చెప్పలేదు.

గులాబీ లేచి నిలబడింది. 'అమ్మానాన్న లకి ఎంతమంది పిల్లలున్నా అందరిపట్లా సమభావమే ఉంటుంది మాస్టారూ! ఎవరు ఎంత తినగలరో ఎవరికేది ఇష్టమో అన్నీ వాళ్లకు తెలుసు. పిల్లల అవసరాలను వాళ్ల మంచిని కోరే, వాళ్ల సామర్థ్యాన్ని బట్టి మాత్రమే సమకూరుస్తారు తప్ప పక్షపాత బుద్ధితో కానేకాదు.'

సుమన లేచి ఇలా అంది. 'అయినా కుంతీ దేవి ఒక వేళ మిగిలిన నలుగురికీ కూడా భీముడిలా ఎక్కువ భోజనం పెట్టినా వాళ్లు జీర్ణించుకోలేరని కన్నతల్లి అయిన కుంతీదేవికి తెలుసు మాస్టారూ!'

వాళ్ళ సమాధానాలు నచ్చిన మాస్టారుతో బాటు పిల్లలూ చప్పట్లు కొట్టారు. శ్రియ మాత్రం ముసిముసిగా నవ్వింది. ఆ రోజు మధ్యాహ్న భోజనాలు చేస్తూ.. మతాబాలాగా వెలిగిపోతున్న సుమన మోహం చూసి కారణం అడిగారు స్నేహితురాళ్లు.

సుమన గర్వంగా చెప్పింది. 'మా నాన్న గారికి నేనంటే ఎంత ప్రేమో తెలుసా? అసలు చందమామ కొత్త సంచికను ఎప్పుడో కొన్నప్పటికీ పరీక్షలవుతున్నాయి కదా అని దాచేశారట. నిన్న బీరువాలోంచి తీసి ఇచ్చారు. అబ్బ ఎంత ఆనందం కలిగిందో!'

గులాబీ కూడా సిగ్గుపడుతూ ఇలా అంది. 'ఇప్పటిదాకా మా అమ్మా నాన్నలకి నాకంటే అన్నయ్యంటేనే ఎక్కువ ఇష్టం అనుకున్నానే. కాని మొన్న నాకు జ్వరం వచ్చినప్పుడు నాకెన్ని సేవలు చేశారో తల్చుకుంటే నా ఆలోచన ఎంత తప్పో తెలిసింది.'

శ్రియ నవ్వుతూ అంది. 'పిల్లలు ఆడ అయినా మగ అయినా తల్లిదండ్రులకి రెండు కళ్ల వంటి వాళ్లని.. పిల్లల పట్ల అమ్మా నాన్నల ప్రేమ అమూల్యమని నేను చెబితే నమ్మారా మీరు?'

'అందుకు శిక్షగా నీకిష్టమయిన పులిహోర తెచ్చాం కదా.. ఇదిగో రుచి చూడు.' అంటూ స్వయంగా స్నేహితురాలికి తినిపించింది గులాబీ.

ఆ రోజు సాయంత్రం సరస్వతీ టీచర్ తేలిగ్గా నిట్టూరుస్తూ శ్రియతో ఇలా అన్నారు.

'నా పాఠం మీ ఆడపిల్లలను అపార్థంలోకి, అయోమయంలోకి నెట్టిందని నువ్వు చెప్పకపోతే, నాకు తెలిసేదే కాదు శ్రియా! క్లాసులో మళ్లీ నేనేం చెప్పినా సమర్థించుకున్నట్లే అవుతుందని తెలుగు మాస్టారుకి ఆ పని అప్పగించాను. ఆయన నా మాట మన్నించి కుంతీదేవి పాఠం చెప్పడం ఎంతో సమయోచితంగా ఉంది కదూ!'

'అవును టీచర్!' అంది శ్రియ తృప్తిగా. మబ్బులు తొలగి చంద్రుడు బయటపడినట్టుగా ఆ అమ్మాయికి తన స్నేహితుల మనస్సుల్లో అనుమానాలు తొలగిపోవడం ఎంతో సంతోషం కలిగించింది.





# పంచతంత్ర కథలు

వధువు ఈ కథ చెప్పి, 'అందుచేత విధిని ఎవరూ తప్పించలేరు. నేను ఈ పామును పెళ్లాడకపోతే నా తండ్రికి నూరుమంది కన్యలను చంపినపాపం చుట్టుకుంటుంది,' అన్నది.

ఆమె పామును వైభవంగా పెళ్లాడి అత్త గారి ఇంటనే ఉంటూ భర్తసేవ శ్రద్ధగా చెయ్యసాగింది.

ఒకరాత్రి ఆ పాము తాను ఉండే తట్టలో నుంచి వచ్చి, దివ్యసుందరమైన మానవ రూపంలోతన భార్య పక్క మీద కూర్చు న్నాడు.

ఇది చూసి, ఆమె నిర్ఘాంతపోయి, అతను ఎవరో పరపురుషుడు అనుకుని తలుపులు తెరిచి బయటికి పారిపోబో యింది.

'ప్రేయసి, వెళ్లకు. నేను నీ భర్తను,' అన్నాడు అతను.

ఆమెకు నమ్మకం కలగటం కోసం అతను తట్టలో నిర్జీవంగా పడి ఉన్న పాము శరీరంలో ప్రవేశించి కదలాడి మనిషి రూపంలో ఇవతలికి వచ్చాడు.

తన భర్త మనిషి అయినందుకు ఆమె ఎంతో సంతోషించి, ఆతని నెత్తిన కిరీటమూ, శరీరం మీద ఆభరణాలూ చూస్తూ, అతనికి నమస్కారం చేసింది.

వాళ్లు పడుకుని నిద్రపోయినాక, తన అల్లుడు మనిషేనన్న సంగతి కనిపెట్టిన దేవశర్మ తట్ట నుంచి పాము శరీరాన్ని తీసుకుపోయి తగులబెట్టేశాడు.

కథ పూర్తిచేసి బలభద్రుడు 'మనం మఠంతో బాటు ఈ మహాత్ముడి శరీరాన్ని

మిత్రభేదం – **24**



తగులబెట్టేశామంటే ఆయన ఎల్లప్పుడూ దేవ శరీరంలోనే ఉండిపోతాడు మహారాజా!' అన్నాడు.

రాజు అనుమతించాడు. బలభద్రుడు మఠాన్ని తగులబెట్టించాడు. కపట సన్యాసి అందులో కాలిపోయాడు.

ఇలా చెప్పి కరటకం, 'కనుక ప్రమాదకరమైన నీ కుట్ర కట్టిపెట్టు,' అన్నది.

దానికి దమనకం, 'అది అర్థం లేని మాట. నువు చెప్పే కోటిసిద్ధాంతాలు కూడా నా ఆచరణ విలువ చేయవు. అంతదాకా దేనికిరా అబ్బీ? ఈ ఎద్దు శరీరం మీదనే మనం ఎన్నో నెలలపాటు బతకవచ్చు.దాని కళేబరం ఇప్పుడే నా కళ్లముందు స్పష్టంగా మెదులుతున్నది. కాని, యుక్తి గల నక్క లాగా, ఎత్తు పారిన దాకా ఈ విషయం రహస్యంగా ఉంచు,' అన్నది.

'ఏమిటా కథ?' అని కరటకం అడిగింది.

దమనకం ఇలా చెప్పింది.

### యుక్తిగల నక్క

ఒక అరణ్యంలో వజ్రదంష్ట్రం అనే సింహం ఉండేది. దానికి ముగ్గురు మంత్రులుండేవాళ్లు – చమరకం అనే నక్కా, ఒక తోడేలూ, ఒక ఒంటే.

ఒకనాడు సింహం ఒక మగ ఏనుగుతో ఘోరంగా పోరాడి తీవ్రంగా గాయపడింది. అటు తరవాత అది తన గుహలో బాధతోనూ, ఆకలితోనూ అలమటిస్తూ పడి ఉండి, వేటాడలేకపోయింది. ఆ స్థితిలో అది తన మంత్రులను పిలిచి 'ఆకలితో చచ్చిపోతున్నాను ఏ జంతువునైనా వేటాడి తీసుకురండి,' అన్నది.

అయితే ఎంత గాలించినా వాటికి ఏ జంతువూ చిక్కలేదు.

అప్పుడు చమరకం అనే నక్క తనలో, 'ఈ ఒంటెను చంపినట్లయితే మేమందరమూ కొద్ది రోజులపాటు కడుపునిండా తినవచ్చు. అయితే అది మిత్రుడూ, మంత్రీ కావటం చేత సింహం దాన్ని చంపటానికి ఒప్పుకోదు. అందుచేత, ఒంటె చావడానికి ఒప్పుకునేటట్టు నేనే ఒక యుక్తి పన్నుతాను,' అనుకుని, ఒంటెతో 'మిత్రమా, మన యజమాని తిండి లేక చచ్చిపోతున్నాడు. యజ

మాని చస్తే మన చావూ తప్పదు. అందుచేత, నీకూ, మన యజమానికీ కూడా లాభించే విధంగా ఒక సూచన చేస్తాను' అన్నది.

'తప్పకుండా చెప్పు, నువు చెప్పినట్టు చేస్తాను. యజమానికి సహాయపడటం పుణ్యం కూడానూ,' అన్నది ఒంటె.

'బాబూ, నువు నీ దేహాన్ని నూటికి నూరు వడ్డీ మీద మన యజమానికి ఇచ్చేయి. చచ్చిపోయిన అనంతరం నీకు రెట్టింపు జవసత్వాలు కల జన్మ లభిస్తుంది,' అన్నది నక్క.

'మృత్యుదేవత ఈ ఏర్పాటుకు ఒప్పుకుంటే నాకేమీ అభ్యంతరం లేదు,' అన్నది ఒంటె. నక్క సింహం వద్దకు వెళ్లి, ఎంత వెతికినా తమకు జంతువేదీ దొరకలేదని చెప్పింది. సింహం కుంగిపోయింది. అప్పుడు నక్క ఇలా అన్నది:

'అయితే, ఒక మంచి కబురు కూడా చెబుతాను. మన మిత్రుడు ఒంటె తన శరీరాన్ని మీకు ఇయ్యడానికి సిద్ధంగా ఉన్నది. అయితే అతగాడి శరీరాన్ని నూరు శాతం వడ్డీతో సహా తిరిగి ఇస్తానని మృత్యు దేవత సాక్షిగా హామీ ఇవ్వాలి.'

ఇందుకు సింహం ఒప్పుకుని, ఒంటె ఔదార్యానికి ధన్యవాదాలు తెలుపుకున్నది. తరవాత అది మృత్యుదేవతను సాక్ష్యం ఉండమని కోరిన ప్రకారం వాగ్దానం చేసి, ఒంటెను చంపింది.

నక్కా, తోడేలూ ఒంటె శరీరాన్ని చీల్చి తినడానికి వీలుగా అమర్చాయి. అయితే నక్క ఉద్దేశ్యం ఆ ఒంటె కళేబరమంతా తనకే దక్కాలని, అందుకు అదొక యుక్తి పన్నింది.

సింహం శరీరం నిండా రక్తపు మరక లుండటం చూసి నక్క, 'మీరు నదికి వెళ్లి చక్కగా స్నానం చేసి రండి. అంతదాకా నేను ఒంటె కళేబరాన్ని చూస్తూ ఉంటాను,' అన్నది.

(ఇంకా వుంది)





# దేవుడిచ్చిన బహుమతి

తెల్లమీసాల తాతయ్య అప్పుడే పశువుల కొట్టంలో తల్లి దగ్గర ఆత్రంగా పాలుతాగి ఆనందంతో చెంగుచెంగున గెంతుతున్న లేగదూడని పట్టుకుని ప్రేమగా ఒళ్లంతా నిమురుతున్నాడు.

'తాతయ్యా! ఇవాళ మాకు కొత్త కథ చెబుతానన్నావు?' అంటూ సెలవులకి పల్లెటూరికి వచ్చిన చందు, హరి, సీత, రాజు, చిట్టితల్లి, తాతయ్య చుట్టూ చేరి పోయారు. 'అలాగే చెబుతా గానీ ఇవాళ మీరు నేనడిగే ఓ ప్రశ్నకి నాకు నచ్చిన ఖచ్చితమైన సమాధానం చెప్పాలర్రా...' అన్నాడు తాతయ్య తెల్లమీసాల చాటునుంచి నవ్వుతూ. 'అడుగు తాతయ్యా,' అన్నారు పిల్లలంతా ముక్తకంఠంతో.

'ఇన్నాళ్ల మీ జీవితంలో దేవుడు మీకిచ్చిన గొప్ప బహుమతి ఏంటో చెప్పగలరా?' చందు ఉత్సాహంగా చెప్పాడు. 'మా క్లాసులో నాకూ సోంబాబుకీ చదువులో ఎప్పుడూ పోటీయే. అన్ని పరీక్షల్లోనూ వాడే క్లాసులో మంచి మార్కులు కొట్టేస్తుంటాడు. కానీ మొన్నటి పరీక్షల్లో వాడి బదులు నాకు మొదటి స్థానం రావడం దేవుడు నాకిచ్చిన బహుమతిగా అనుకుంటున్నా తాతయ్యా!'

'బావుందిరా అబ్బాయ్! సీతా నువ్వేమంటావ్ తల్లీ!' అన్నాడు సీతకేసి చూసి.

'మరేమో.. సెలవులకి నాన్న ఎప్పుడూ తిరుపతి తీసుకెళ్తుంటారు కదా! నాకేమో మా పాఠాల్లో చదువుకునే చారిత్రక ప్రదేశాలు చూడాలని ఉంటుంది. ఈసారి నాన్న నన్ను తమ్ముడిని అడగకుండానే ఆగ్రా తీసికెళ్లగానే అక్కడ ఆ పౌర్ణమిరోజున చల్లని వెన్నెలలో తాజ్‌మహల్ అందాలను కళ్లారా చూసి పులకరించిపోయాం అనుకో తాతయ్యా...

ఎ. సత్యనారాయణ మూర్తి

అదే దేవుడు నాకిచ్చిన గొప్ప బహుమతి అను కుంటున్నాను.' అంది సీత ఉత్సాహంగా.

రాజు చలాకీగా అన్నాడు. 'ఎప్పుడూ సమయమైపోతోందని బడికి పరిగెత్తడం, పాఠాలు, చదువులు, మార్కులు, ఇదే గోల. ఇదిగో ఇలా ఆ పల్లెలో మాకు ఇష్ట మైన గోళీకాయలు, బిళ్లంగోడు, కోతికొ మ్మచ్చిలాంటి ఆటలు ఆడుకోవడానికి సెలవులు దొరకడం పిల్లలకు దేవుడిచ్చిన బహుమతేగా తాతయ్యా! ఈ నెల్లాళ్లూ అమ్మానాన్నా చదువుకోమని ఆంక్షలు పెట్టరుగా.'

'ఆరి గడుగ్గాయి.' అన్నాడు తాతయ్య మనవడి తెలివితేటలకు మురిసిపోతూ.

'తాతయ్యా నువ్వడగకుండానే చెప్పే స్తున్నా.. మా బడిలో పాటల పోటీలో నాకె ప్పుడూ ఎన్నెన్నో బహుమతులొస్తుంటాయి. అంటే చక్కని గొంతు దేవుడు నాకిచ్చిన గొప్ప బహుమతేగా,' అన్నాడు హరి గర్వంగా.

దిగాలుగా మాట్లాడకుండా బుగ్గన చెయ్యేసుకుని కూర్చున్న ఆరేళ్ల చిట్టితల్లిని ఎత్తి ఒళ్లో కూర్చోబెట్టుకుని తాతయ్య అడిగాడు. 'నువ్వేమంటావే చిట్టమ్మా..?'

చిట్టితల్లి ముద్దు ముద్దుగా 'అమ్మ' అంది. ఆమాట వినగానే తక్కిన పిల్లలంతా నాలిక కరుచుకుని విస్తుపోగా తాతయ్య కళ్లు ఆనందంగా మెరిసాయి.

'ఎంతబాగా చెప్పావే తల్లీ.. పిల్లలూ విన్నారర్రా.. చిట్టితల్లి చెప్పిందే అసలైన జవాబు. ఎలాగో చెప్పనా? మనం కడు



పులో ఉన్నప్పుడు తన్నినా, బయటికొచ్చాక అల్లరి పెట్టినా పెద్దయ్యాక పట్టించుకోక పోయినా సహనంతో ఎల్లప్పుడూ బిడ్డల క్షేమాన్నే కోరుతుందర్రా అమ్మ. కన్నబిడ్డల మొహంలో చిరునవ్వు కోసం సంతృప్తికోసం జీవితంలో ఎంతటి కష్టాన్నయినా భరిస్తూ ఎన్ని త్యాగాలనయినా అవలీలగా చేసే అమ్మని మించిన బహుమతి ఏముందర్రా పిల్లలూ. దేవుడు అన్నిచోట్లా తను ఉండలేక అమ్మని సృష్టించాడని తెలుసా మీకు?' అన్నాడు తాతయ్య.

'తాతయ్యా.. చిట్టి చెప్పిందే నిజం. ఈసారి నాకు క్లాసులో మంచిమార్కులతో ఏ మొదటి స్థానం వచ్చిందని అమ్మ ఎంత మురిసిపోయిందో.. అమ్మని ఇలా మరిచి పోయామేంటో?' అన్నాడు చందు విచారంగా.

'నిజానికి నా మనసులో ఎన్నాళ్లనుంచో దాగిఉన్న కోరికని నాన్నతో చెప్పడానికి నేను భయపడినప్పటికీ అమ్మ గ్రహించి చెప్పబట్టే నాన్న మమ్మల్ని ఆగ్రా తీసికెళ్లారు.' అంది సీత.

రాజు అన్నాడు. 'మేమేమీ పల్లెలో అల్లరి చేసి దెబ్బలు తగిలించుకోమని అమ్మకు భరోసా ఇవ్వబట్టే నాన్న ఇక్కడికి పంపించారు. లేకపోతే ఒప్పుకునేవారే కాదు.'

'ఇంట్లో పనిపాటలతో అమ్మ ఎంత అలసిపోయినా శని, ఆదివారాల్లో నాకు చక్కని అన్నమయ్య పాటలు నేర్పి పాటల పోటీకి తయారు చేసి నాకు బహుమతి రాగానే తనకే బహుమతి వచ్చినంతగా సంబరపడుతుంది అమ్మ. నిజంగా అమ్మే నాకు లోకంలో గొప్ప బహుమతి. ఇలాంటి అమ్మగురించి నేను చెప్పకపోవడం తప్పే తాతయ్యా!' అన్నాడు హరి పశ్చాత్తాపంగా.

'చిట్టీ! మరి మీ అమ్మగురించి నువ్వేం చెప్పవేం?' అన్నారు పిల్లలంతా.

'అమ్మదగ్గర పడుకుంటే నాకస్సలు భయమే వెయ్యదు. ఇక్కడ అమ్మలేదుగా. అందుకే రోజూ అమ్మ నా కలలోకి వస్తోంది. తాతయ్యా, నన్ను మా అమ్మదగ్గిరికి ఇవాళే పంపించవూ.' అంది జాలిగా చిట్టి.

'నా బంగారు తల్లీ.. రేపు మనింట్లో స్వామివారి పూజ ఉందిగా అందుకని మీ అమ్మే కాదమ్మా.. వీళ్లందరి అమ్మలూ మరి కాసేపట్లో ఇక్కడికే వచ్చేస్తారు తెలుసా? మీ మాటలు వింటూంటే నాకూ మా అమ్మ గుర్తుకొస్తోందర్రా పిల్లలూ.. చిన్నప్పుడు మా అందరికీ భోజనాలు పెట్టేసి తనకు అన్నం మిగలకపోతే మంచినీళ్లు తాగేసి తనకి ఆకలి లేదనే దేవత మా అమ్మ..' అన్నాడు తాతయ్య కళ్లు తుడుచుకుంటూ.

పిల్లలూ! అప్పుడే జట్కాబండి దిగిన తమ తమ మాతృమూర్తుల చుట్టూ బిల బిల్లాడుతూ చేరిపోయిన పిల్లలంతా అమ్మలందరికీ కృతజ్ఞతగా ఇచ్చిన బహుమతేంటో తెలుసా? ఓ తియ్యని ముద్దు...





# లోభి తెలివి

హేలాపురి నివాసి శీనయ్య శెట్టి ఎంగిలి చేత్తో కాకిని తోలని పిసినారి. ధాన్యం వ్యాపారంలో లక్షలు ఆర్జించినా అవసరానికి కూడా గుడ్డి గవ్వ ఖర్చు పెట్టడానికి వెనుకాడే మనస్తత్వం కలవాడు.

వయసులో ఉన్నప్పుడు విలాసవంతమైన జీవితం గడిపి వృద్ధాప్యంలో దీర్ఘ వ్యాధితో తీసుకుంటున్న తండ్రి గున్నయ్య శెట్టి పడకేశాడు. అయితే ముసలి తండ్రికి వైద్యం చేయించడానికి డబ్బు మంచి నీళ్లలా ఖర్చయిపోతుండటంతో లబలబలాడుతుండేవాడు శీనయ్య శెట్టి. ఎందరో ఘనాపాటి వైద్యులతో మంచి వైద్యం చేయించినా గున్నయ్య శెట్టి జబ్బు మాత్రం నయం కావడం లేదు.

సుగంధపురిలో వైద్యుడిగా ఎంతో పేరు గడించిన రంగాచారి హస్తవాసి చాలా మంచిదని తెలిసిన శీనయ్య శెట్టి – తండ్రిని అతని వద్ద వైద్యానికి తీసుకు వెళ్లేడు.

గున్నయ్య శెట్టిని రకరకాలుగా పరీక్షించిన రంగాచారి పెదవి విరిచాడు.

'శీనయ్య శెట్టిగారూ, ఇలా చెబుతున్నందుకు మీరు మరోలా భావించవద్దు. వయసులో ఉండగా తమ తండ్రి గారు విచ్చలవిడిగా తిరిగిన ఫలితమే ఇది. అనేక రోగాలకు ఆలవాలమైపోయింది తమ తండ్రి గారి శరీరం. ఏ మందులకూ లొంగని జబ్బులు ఆయనలో తిష్టవేసుకుని కూర్చున్నాయి. ఆయన బ్రతుకుతారన్న ఆశ ఏ కోశానా కనబడటం లేదు. ఏ మందులూ ఆయనకు పని చేస్తాయనుకోను.' అని తేల్చి చెప్పేశాడు రంగాచారి.

అయినా శీనయ్య శెట్టి వదల్లేదు రంగాచారిని. 'అయ్యా, మీరేం నిరాశపడవద్దు.

కోనే నాగ వెంకట ఆంజనేయులు

వైద్యుడిగా మీ ప్రతిభ గురించి విన్న తర్వాతే నేను మీ వద్దకు వచ్చాను. మాతండ్రిగారికి మీకు సరైనది అని అనిపించిన వైద్యం చెయ్యండి. ఆపై దేవుడిమీద భారం వేద్దాం! మీరు చేసే వైద్యం మాతండ్రిగారిని బ్రతికించినా, బతికించకున్నా కూడా మీకు వెయ్యివరహాలు ప్రతిఫలంగా ఇచ్చుకుంటాను,' అన్నాడు శీనయ్యశెట్టి.

ఆయన అంతగా ప్రాధేయపడుతుండటంతో సరే అనక తప్పలేదు రంగాచారికి.

ఆయన తన ప్రతిభనంతా ఉపయోగించి – గున్నయ్యశెట్టికి నెలరోజుల పాటు వైద్యం చేశాడు. అనేక వైద్య గ్రంథాలు పరిశీలించి రకరకాల ఔషధాలు మార్చి మార్చి వాడినా ఫలితం దక్కలేదు. రోగం ముదిరి గున్నయ్యశెట్టి మరణించేడు.

అతని అంత్యక్రియలు అన్నీ ముగిసిన తరవాత రంగాచారి గున్నయ్యశెట్టిని దర్శించి తనకు రావలసిన వెయ్యి వరహాలు ఇప్పించవలసిందిగా కోరేడు.

ఏ వెయ్యి వరహాలు? అని ప్రశ్నించేడు శీనయ్యశెట్టి. 'అదే తమరి తండ్రిగారి వైద్య నిమిత్తం తమరు ఇవ్వవలసిన వెయ్యి వరహాలు' చెప్పాడు రంగాచారి.

'అయ్యా తమరు నా తండ్రిని బతికించారా?' అని అడిగాడు సీనయ్యశెట్టి.

'లేదే..' అన్నాడు రంగాచారి నొచ్చుకుంటూ. 'పోనీ నా తండ్రిని మీరు చంపేరా?' అని అడిగేడు శీనయ్యశెట్టి.

'అయ్యో! నేనెందుకు చంపుతానండి?' అన్నాడు రంగాచారి కంగారుపడుతూ.

'అయ్యా! మీరు నాతండ్రిని మీ వైద్యంతో బతికించినా, చంపినా మీకు వెయ్యివరహాలిస్తానన్నాను. కానీ మీరు నా తండ్రిని బతికించనూ లేదు. చంపనూ లేదు. మరి నేను మీకు వెయ్యివరహాలు ఇవ్వవలసిన అవసరమేమున్నది?' అడిగాడు శీనయ్యశెట్టి.

ఒప్పందాన్ని శీనయ్యశెట్టి నిర్వచించిన విధానానికి రంగాచారి నోట మాట రాక నిశ్చేష్టుడయ్యాడు.





# షరతు

'చెల్లాయ్! ఇవాళ నీకో కొత్త ఆట నేర్పనా?' అంటూ బంటీ తన చెల్లాయి బబ్లీని అడిగాడు. అలాగే అంటూ తల ఊపింది బబ్లీ. 'ఆ ఆటలో దెబ్బలు తగిలినా నాన్నగారికి చెప్పకూడదు.' అంటూ షరతు పెట్టాడు. బంటీ కొత్త ఆటమీది కుతూహలంతో వెంటనే ఒప్పేసుకుంది.

'అయితే పద.' అంటూ పెరట్లోకి తీసుకెళ్లి పాతవస్తువుల మధ్యలో ఓ వస్తువుపై కప్పి ఉంచిన గుడ్డను తీసేశాడు బంటీ. 'అరే సైకిలు.. మనది కాదే.. ఇదెవరిది?' అంది బబ్లీ ఆశ్చర్యంగా.

'నా స్నేహితుడు రాజానడిగి తెచ్చాలే,' గర్వంగా అన్నాడు బంటీ. తనకి సైకిలు తొక్కడమంటే ఎంత ఇష్టమో! కానీ సైకిలు కొనిపెట్టమంటూ ఎన్నిసార్లడిగినా నాన్న తర్వాత చూద్దాంలే, అని దాటేస్తున్నారే తప్ప కొనడం లేదు. అందుకే ఇవాళ ఆదివారం కదా... నాన్నగారు కూరగాయల బజారుకెళ్లినప్పుడు తొక్కుకోవచ్చునులే అని ముందురోజు రాత్రి రాజాని బతిమాలి సైకిలు తెచ్చి ఇంటి పెరట్లో రహస్యంగా దాచి ఉంచాడు.

'బబ్లీ! నువ్వు సైకిల్ వెనుక కూర్చో. నేను ముందు సీటుపై కూర్చుని తొక్కుతాను,' అన్నాడు గర్వంగా బంటీ.

'నీకు సైకిలు తొక్కడం రాదుగా. నన్ను కింద పడేస్తావు బాబూ. నేను ఎక్కను,' అంది బబ్లీ.

'లేదు.. నేను సైకిల్ ఎంత బాగా తొక్కుతానో నువ్వే చూస్తావుగా,' అంటూ బలవంతంగా బబ్లీని వెనకసీటు మీదికి ఎక్కించి బంటీ సైకిల్ తొక్కడం మొదలుపెట్టాడు. ఒకవైపు పడిపోతానేమోనని బబ్లీకి ఎంతో భయంగా ఉన్నప్పటికీ సైకిలుపై సరదా కొద్దీ ఊరుకుంది.

పి.ఐశ్వర్య

బంటీ అలా ఓ అరగంట సైకిలు తొక్కాడో లేదో.. వీధి చివర కూరల సంచి మోసు కుంటూ తండ్రి కనిపించేసరికి హడలిపో యాడు. ఆ కంగారులో సైకిలు అదుపు తప్పి కిందపడింది.

బబ్లీ మోకాలికి సూదిగా ఉన్న రాయి గీరుకుపోయి కాస్త రక్తం వచ్చేసరికి అన్నయ్యే షరతు మరిచిపోయి ఘొల్లున ఏడవసా గింది. ఆలోచిస్తూ వస్తున్న బంటీ తండ్రి బబ్లీ ఏడుపు విని తలెత్తి చూసేసరికి బంటీ వణికిపోయాడు. బబ్లీని అలాగే వదిలేసి సైకిలుతో సహా దూరంగా పారిపోయాడు.

దాదాపు ఓ గంట తర్వాత పిల్లిలా ఇంట్లోకి అడుగుపెట్టాడు బంటీ. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. అయినా నాన్న ఏవైపునుంచి వచ్చి వీపుచీరేస్తారని భయమే.

కానీ, 'ఏరా బంటీ! అన్నం తినకుండా ఇంతసేపు ఎక్కడికెళ్ళావురా పద భోంచే ద్దువు గాని,' అంటూ అమ్మ అన్నం పెట్టింది. చెల్లాయిని కిందపడేసినందుకు తండ్రి బయటినుంచి వచ్చి కొట్టడం ఖాయమను కున్నాడు బంటీ. కాని వాడి తండ్రి ఆ రాత్రి కూడా బంటీని ఏమీ అనలేదు.

'ఆ మరునాడు బంటీ పాఠశాల నుంచి ఇంటికి తిరిగొచ్చేసరికి వాకిట్లో కొత్త సైకిలు మిలమిలా మెరుస్తూ కనిపించింది. బంటీకి ఆశ్చర్యంతో నోటమాట రాలేదు.

''సైకిల్ తీసుకోరా బంటీ. ఇది నీకోసమే కొన్నాను. అందుకే అన్నారురా 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అని.. అసలు నీకు రాజాని సైకిలు ఇవ్వమని చెప్పింది కూడా నేనే.. తెలుసా? అకస్మాత్తుగా నన్ను చూసి భయపడి చెల్లిని కిందపడేశావు గానీ ప్రయత్నంతో నీకు సైకిలు తొక్కడం బాగా వచ్చేసినందుకు సంతోషం. అయితే నీ పరీ క్షలు అయిపోయేవరకు రాజా సైకిలు గానీ ఈ సైకిలు గానీ ముట్టుకోకూడదు సుమా,'' అంటూ షరతు పెట్టాడు తండ్రి.

తన మనసు గ్రహించి తండ్రి సైకిలు కొన్నందుకు బంటీ ఆనందంతో పొంగిపోతూ తండ్రి మాటకు బుద్ధిగా తల ఊపాడు. అన్నమాట నిలబెట్టుకున్నాడు కూడా.






# అనాగరికుడెవరు?

పూర్వం ఈజిప్టుదేశాన్ని మెహర్ అనే ఒక గొప్ప సుల్తాను పరిపాలించాడు. ఉన్న దానితో తృప్తిపడక, రాజ్యాన్ని పెంచా లన్న ఆశ కలిగిందాతనికి, ఈ ఆశతో మెహర్ సుల్తాను చుట్టుపక్కల దేశాల న్నింటినీ ఆక్రమించుకుని, ఆ రాజుల చేత కప్పాలు కట్టించుకుని, ఎలాగైనా చక్రవర్తి ననిపించుకోవాలని నిశ్చయిం చుకొన్నాడు. వెంటనే ఖజానాలో సొమ్ము అంతా వెచ్చించి గొప్ప సేనలు పోగు చేసి విజయయాత్ర సాగించాడు.

దండెత్తి వచ్చిన మెహర్‌ని పౌరుషవం తులైన రాజులు కొందరు ఎదిరించారు. కాని సముద్రానికి మల్లే పొంగివచ్చిన ఈజిప్టు సేనలముందు వాళ్లపౌరుషం వృధా అయింది. ఆ మహావీరులు యుద్ధంలో ప్రాణాలను కోల్పోవలసి వచ్చింది. మెహర్‌ని ఎదిరించి లాభం లేదని, కొందరు రాజులు సంధి చేసుకొని కప్పాలు కట్టడానికి ఒప్పుకున్నారు.

రాజ్యాలు వశమౌతున్న కొద్దీ మెహర్‌కి దాహమెక్కువైంది. కొత్తగా వశమైన దేశా లలోని సొమ్మంతా కొల్లగొట్టి తీసుకు పోయి కొత్త సైన్యాలు పోగుచేసి కొత్త ప్రాంతాలపైన ఇంకా దండయాత్రలు సాగించాడు. ఇలా దౌర్జన్యానికి గురి అయిన దేశాలలో షికాంగూ అనేది ఒకటి.

షికాంగూ కొండలతోనూ అడవులు తోనూ నిండి ఉన్న దేశం. అహంకారం కొద్దీ మెహర్ ఆ దేశాన్ని కూడా ముట్టడిం చాడే కాని, దాని జోలికి పోకపోతేనే తీరిపోను. షికాంగూ రాజు అనుచరు

కె. దండపాణి



లంతా మన దేశంలోని భిల్లుల వంటి ఆటవికులు. ఏ చెట్టుమీదో, పుట్టవెనుకనో పొంచి ఉండి విషం పూసిన బాణాలు ప్రయోగించి మెహర్ సేనలో చాలామంది వీరుల ప్రాణాలు తీశారు. ఏమరుపాటున రాత్రివేళ నిద్రపోతుండగా చూసి చీమలబారులకు మల్లే తండోపతండాలుగా కొండ దిగివచ్చి, మెహర్ సైనికులలో ఎక్కడివాళ్ల నక్కడ నరికి పోగెట్టి పారిపోయారు.

అప్పుడు ముఖ్యసేనాని, చక్రవర్తితో 'ప్రభూ! మనమీ దండయాత్ర వదులుకుని తిరుగుదారి పట్టడం శ్రేయస్కరం. చావగా మిగిలిన సైనికులంతా స్వదేశానికి పోవాలని కోరుతున్నారు,' అని మనవి చేశాడు. కాని మెహర్ ఒప్పుకోలేదు. అతనికి పట్టుదలే ప్రధానం.

'ప్రభూ! తమరు చక్రవర్తులనిపించుకొన్నారు. నైలునదీ ప్రాంతానికంతకూ ఏకచ్ఛత్రాధిపత్యం వహించారు. ఇంతటితో ఆగడం మంచిది. జయించిన దేశాలను నిలబెట్టుకోగలిగితే అదే పదివేలు,' అన్నాడు సేనాని.

'ఈ షికాంగూ రాజ్యాన్ని వశం చేసుకోవాలి. కదలాలి. ఇంతమందిని లొంగదీసుకుని చివరికి ఒక కొండరాజుకు లొంగిపోవడమా?' అన్నాడు మెహర్.

మెహర్ ఆజ్ఞకు తిరుగులేదు. లెక్కలేకుండా సొమ్ము వెచ్చించి కొత్త సేనలను రప్పించారు. ఆ రాజును వశం చేసుకోవాలన్న పట్టుదలే గాని రాళ్లూ రప్పలూ తుప్పలూ తప్ప ఏమీ లేని ఆ అడవులను వశం చేసుకోవడం వల్ల ఒలికే భాగ్యమేమీ లేదని మెహర్‌కు తట్టలేదు.

పట్టుదలే ప్రధానంగా, షికాంగూ రాజైన 'బెట్యూ'ను ప్రాణంతో కాని, చంపివేసి కాని తెచ్చి ఎదుట పెట్టినవాడికి వెయ్యి మొహరీలిస్తానని సైనికులను పురికొలిపాడు.

మెహర్ సైనికులు అదేపనిగా అడవిలో చొరబడి కనబడ్డ భిల్లవీరుడినల్లా వధించడం మొదలుపెట్టారు. భిల్లుడొక్కడూ పదేసిమందిని చంపితే గాని చావలేదు. కాని నేలమీద ఈనినట్టుగా

పుట్టుకొస్తున్న ఈజిప్టు సేనలను నెగ్గుకు రావటం మాత్రం అసాధ్యమని అనిపించింది వాళ్లకు.

'బెట్సూ' రాజు మొదట సంధి చేసుకుందామనుకున్నాడు గాని, మెహర్ ఒప్పుకోడనీ, సంధికోసం వెళితే పట్టుకుని కసి కొద్దీ చిత్రవధ చేయిస్తాడనీ తెలుసు. కాబట్టి, ఈ పరిస్థితిలో యుద్ధం చేసి వీరస్వర్గం పొందడమే మేలనుకున్నాడు. ఈ నిశ్చయింతో భిల్లులందరినీ వెంటబెట్టుకుని ఈజిప్టు సేనల్ని రెండు కొండల మధ్య ఘోరంగా ఢీకొన్నాడు.

ఆ మహాయుద్ధంలో చివరికి మెహర్‌కే విజయం లభించింది. భిల్లవీరుడొక్కడూ మిగలలేదు. ఐతే, మెహర్ సైన్యంలోనూ వేలాది సైనికులు ప్రాణాలను కోల్పోయారు.

'బెట్సూ ఎక్కడ?' అని అడిగాడు మెహరు ఆత్రంతో.

'గాయాలతో నిండి ఉన్న అతని కళేబరం యుద్ధరంగంలో మన సైనికుల పీనుగుల మధ్య పడి ఉంది ప్రభూ' అన్నాడు ఒకసేనాని. అతడిని చూడాలన్న ఆసక్తితో మెహర్ బయలుదేరి వెళ్ళాడు. అతడు చేరుకునేసరికి అక్కడ, కారు నలుపు శరీరంతో భయం గొలిపే ఆకారంతో, ఎత్తయిన మనుష్యుడొకడు ఆ వేలాది పీనుగుల మధ్య నలువంకలా పరికిస్తూ నిలబడి ఉన్నాడు.



వాణ్ణి చూడటంతోనే మెహర్, 'ఎవరు నువ్వు?' అన్నాడు.

'వీడెవడో నరమాంస భక్షకుడు. పీనుగులను పీక్కుతినడానికి వచ్చాడు' అన్నాడు సేనాని.

సేనాని చెప్పింది నిజమే. ఆఫ్రికా దేశపు అడవులలో మనుష్యుల మాంసం తినేవాళ్లు ఎందరో ఉన్నారు.

మెహర్ ఆ నరమాంస భక్షకునితో 'ఇంత మాంసం లభించింది కదా, ఏదో శవాన్ని తీసుకుని పోక, అలా దిక్కు దిక్కులు చూస్తున్నావేం?' అని అడిగాడు.

'వీళ్లనందరనూ తినడానికెవరో చంపుకొన్నారు. నాకు కావలసింది ఒక్కటే శవం. ఐనా, వారి అనుమతి తీసుకుని

మరీ తినడం ధర్మం కదా! అందుకని, ఆ చంపిన వారికోసం ఇక్కడ ఎదురు చూస్తున్నాను,' అన్నాడు నల్లవాడు.

మెహర్ పక్కున నవ్వి, 'వీళ్ళనంద రనూ చంపించింది నేనే! కాని, తినటా నికి మాత్రం కాదు,' అన్నాడు.

నల్లవాడు ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ, 'తినటానికి కాకపోతే ఇంతమందినీ వృథాగా ఎందుకు చంపినట్టు?' అని ఎదురు ప్రశ్న వేశాడు నిర్భయంగా.

మెహర్ చక్రవర్తి సేనానితో, 'వీడు కేవలమూ అనాగరికుడు. వీడికి నచ్చే టట్టు మనం తెలియచెప్పడం అసాధ్యం,' అన్నాడు.

అంతట, చక్రవర్తికి వెనుక పక్కగా ఎవరో నవ్వుతున్నట్లు అలికిడి అయింది. మెహర్ గభీమని వెనుకకు తిరిగి చూసే సరికి, అడవులలో తపస్సు చేసుకొనే ఫకీరొకడు ఎదట ప్రత్యక్షమయాడు.

'మహాత్మా, నవ్వారెందుకు?' అని అడిగాడు మెహర్ విస్మయంతో.

'సుల్తాన్! నీవు కేవలం అనాగరికు డని భావించే ఈ నరమాంస భక్షకుడు ఆకలి తీర్చుకోటానికే గాని అనవసరంగా తోటి మానవుల ప్రాణం తీయడు. నీవో? సామ్రాజ్యాన్ని వ్యాపింపచెయ్యాలనే కాంక్షతో యుద్ధాలు తలపెట్టి, లక్షలాది మానవుల ప్రాణాలు నిష్కారణంగా తీయించుతున్నావు. ఒక్క క్షణం ఆలో చించు, మీ ఇద్దరిలో అనాగరికులెవరో నీకే తెలుస్తుంది!' అన్నాడు ఫకీరు పిడు గులు పడినట్టుగా పలుకుతూ.

ఫకీరు మాటలలోని సత్యాన్ని గ్రహించి మెహర్ సిగ్గుతో తల వంచుకున్నాడు.

అంతే కాదు. ఆ క్షణంలో అతని మనస్సే మారిపోయింది. ఇక ఈ రోజు నుంచి యుద్ధమనే మాటనే తలపెట్ట నని నిశ్చయించుకున్నాడు.





# అబద్ధం ఖరీదు

పద్నాలుగేళ్ల గోవిందుడు - తల్లిదండ్రులు పడవ ప్రమాదంలో మరణించడంతో, దిక్కులేనివాడయ్యాడు. అదే ఊళ్లో కిరాణా వ్యాపారం చేసుకునే జగన్నాథం, జాలిమనసుతో గోవిందుణ్ణి చేరదీసి తన దుకాణంలో పనికి పెట్టుకోవడమే కాక, వాణ్ణి తన ఇంట్లోనే ఉంచుకుని మూడు పూటలా భోజనం పెట్టేవాడు. వాడి శ్రమకు తగు ఫలంగా నెలనెలా జీతం కూడా ఇచ్చేవాడు.

ఐతే సొమ్ము వాడి చేతికి ఇవ్వకుండా, బ్యాంకులో వాడి పేరిట ఖాతా తెరిచి అందులో వేస్తూండేవాడు. వాడు పెద్దయ్యాక పెళ్లి చేస్తే అప్పుడు ఆ సొమ్ము వాడికి అక్కరకు వస్తుందన్నది అతని ఆలోచన.

గోవిందుణ్ణి తన ఇంటి మనిషిలా చూసుకునేవాడు అతను. జగన్నాథానికి సంతానం లేకపోవడం కూడా అందుకు ఓ కారణం. గోవిందుడు కూడా జగన్నాథం కుటుంబంలో ఒకడిగా కలిసిపోయాడు. నిజాయితీగా ఉంటూ కష్టించి పనిచేసే గోవిందుడి పైన సదభిప్రాయమూ, నమ్మకమూ ఏర్పడటంతో తరచు దుకాణాన్ని వాడికి అప్పగించి, తాను బైట వ్యవహారాలను చక్కబెట్టుకునేవాడు జగన్నాథం.

ఇలా ఉండగా, ఓసారి గల్లా పెట్టెలోంచి పాతిక రూపాయలు మాయమయ్యాయి. ఆ రోజు జగన్నాథం దుకాణంలోనే ఉన్నాడు. గోవిందుడు అతనికి సాయం చేస్తున్నాడు. మధ్యలో ఓసారి

తిరుమలశ్రీ



నెల్లాళ్ళ తరవాత – ఓ రోజున జగన్నాథం, గోవిందులు దుకాణంలో ఉండగా గోవిందుడి స్నేహితుడు శివ పరిగెత్తుకుంటూ అక్కడికి వచ్చి, 'ఒరేయ్ గోవిందూ పోయిన నెలలో నువ్వు కొన్న లాటరీ టికెట్‌కు బహుమతి వచ్చిందిరా,' అంటూ సంతోషంగా చెప్పాడు.

గోవిందుడు ఆనందంతో, 'నిజంగా? ఏదీ చూడనీ,' అంటూ స్నేహితుడి చేతిలోని దినపత్రికను ఆత్రుతగా లాక్కుని లాటరీ ఫలితాలను చూశాడు. వాడు కొన్న టికెట్ సంఖ్యకు పాతికవేల రూపాయల బహుమతి వచ్చింది.

జగన్నాథం విస్తుపోతూ, 'నాకు తెలియకుండా లాటరీ టికెట్ ఎప్పుడు కొన్నావురా, గోవిందూ? నీకు డబ్బులు ఎలా వచ్చాయి?' అనడిగాడు.

అందుకు గోవిందుడు, 'ఆ రోజు మీరు గల్లాపెట్టె లోంచి డబ్బులు తగ్గాయని నన్ను అడిగితే, నేను తీయలేదని చెప్పాను. నిజానికి లాటరీ టికెట్ కొనడం కోసమని ఆ పాతిక రూపాయలూ నేనే తీశాను,' అన్నాడు.

జగన్నాథం నమ్మలేనట్లుగా చూస్తుంటే, 'నా మిత్రులు లాటరీ టిక్కెట్లు కొంటూ ఉంటే, నేనూ నా అదృష్టం పరీక్షించుకోవాలనుకున్నాను. మీతో నిజం చెప్పడానికి భయపడి అబద్ధం చెప్పాను. క్షమించండి,' అన్నాడు తలవంచుకుని.

భోజనానికి మాత్రం పెళ్లి వచ్చాడు జగన్నాథం. రాత్రి దుకాణం మూసేశాక ఆ నాటి అమ్మకాలకు సంబంధించి యధావిధిగా లెక్కలు చూసుకుంటూంటే, ఒక పాతిక రూపాయలు తక్కువైనట్టు గ్రహించాడు జగన్నాథం. ఎంతగా తల బద్దలు చేసుకున్నప్పటికీ ఆ సొమ్ము ఏమయిందో తెలియలేదు.

ఎందుకైనా మంచిదని గోవిందుణ్ణి పిలిచి అడిగితే, ఆ రోజు తాను అసలు గల్లా పెట్టెనే ముట్టుకోలేదన్నాడు వాడు. ఎన్నడూ అబద్ధం ఆడని వాడి పలుకులను విశ్వసించిన జగన్నాథం తాను ఏం ఖర్చు చేసి మరిచిపోయాడో జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నించాడు.

గోవిందుడికి లాటరీలో పాతికవేలు బహుమతి వచ్చినందుకు ఎంతో సంతో షించాడు జగన్నాథం. అందరికీ మిఠా యిలు తెప్పించి పంచి పెట్టాడు.

తరువాత ఆ సొమ్ము చేతికి వచ్చాక వృధాగా ఖర్చు చేయకుండా బ్యాంకులో వేసుకుని దాచుకొమ్మని గోవిందుడికి సలహా ఇచ్చాడు. అంతే కాదు, కష్టార్జితం వెచ్చించి లాటరీలు కట్టడం జూదంతో సమానం. ఇంకెప్పుడూ లాటరీల జోలికి పోకు, అని హితవు కూడా చెప్పాడు వాడికి.

ఐతే, రెండు రోజుల తరవాత- అంత వరకూ నెలనెలా బ్యాంకులో జమకడు తున్న వాడి జీతం తాలూకు పాస్ పుస్త కాన్ని గోవిందుడి చేతిలో పెట్టాడు జగ న్నాథం.

'ఇవాల్టి నుండి నువ్వు పనిలోకి రాన వసరం లేదు. నీ మకాం కూడా మార్చేయ్' అన్నాడు వాడికి ఉద్వాసన చెబుతూ.

తెల్లబోయిన గోవిందుడు, జగన్నాథం కాళ్లపైన పడి ' అయ్యా! తెలియక చేసిన నా అపరాధం ఈ ఒక్కసారికి క్షమించండి. ఇంకెప్పుడూ అలాంటి తప్పు చేయను. ఎన్నడూ అబద్ధం చెప్పను. నన్ను పొమ్మ నకండి,' అంటూ ప్రాథేయపడ్డాడు.

జగన్నాథం వాణ్ణి పైకి లేవదీసి, 'నువ్వు డబ్బు తీసినందుకు కాదురా, గోవిందూ! అబద్ధం చెప్పినందుకు కూడా కాదు. నేను మునుపటిలా నిన్ను నమ్మలేనే అన్న ఒక్క కారణంగానే నీకు ఉద్వాసన చెప్పవలసి వస్తోందిరా... ముందు ముందు నువ్వు నిజం చెప్పినా, అబద్ధం చెబుతున్నావేమో అన్న అనుమానం నన్ను పీడిస్తుంటే... అది మనిద్దరికీ మంచిది కాదనే!' అన్నాడు గాంభీర్యంగా.

గోవిందుడు ఇక చేసేది లేక, 'అబద్ధం ఖరీదు ఇదా!' అనుకుంటూ బయటకు నడిచాడు.






# మాటకారి ముసలమ్మ

ధారానగరానికి రాజైన భోజరాజూ, ఆయన ఆస్థాన కవులలో ఒకడైన మాఘుడూ ఒక నాడు సాయంకాలం షికారు బయలు దేరారు. కవితాగోష్టిలో వారు కాలం మరిచి చాలాదూరం వెళ్లారు. చీకటిపడిపోయింది. వారు రాజభవనానికి బయలుదేరేసరికి దారి ఎటో తెలియలేదు. ఎవరినైనా అడిగి దారి తెలుసుకుందామని వారు కొంత దూరం నడిచి ఒక పూరిగుడిసె వద్దకు వచ్చారు. అక్కడ వారికొక ముసలమ్మ కనిపించింది.

భోజరాజు 'అవ్వా, ఈ దారి ఎక్కడికి పోతుంది?' అని అడిగాడు.

'ఎక్కడికి పోవాలో దారినపోయేవాళ్ళకు తెలియాలి కాని దారికేం తెలుస్తుంది నాయనా? ఇంతకూ మీరెవరు?' అన్నది మాటకారి అయిన ముసలమ్మ.

'మేము ప్రయాణీకులం,' అన్నాడు మాఘుడు నవ్వుతూ.

'సృష్టిలో సూర్యచంద్రులిద్దరే ప్రయాణీకులు. మీరు సూర్యచంద్రులా?' అని అడిగింది ముసలమ్మ.

'మేము కేవలం క్షణికమైన అతిథులం,' అన్నాడు మాఘుడు.

'డబ్బూ, యవ్వనమూ ఈ రెండే క్షణికమైన అతిథులు. మీరు అలా కనిపించరే?' అన్నది ముసలమ్మ.

'మేము పాలకులం,' అన్నాడు భోజరాజు.

'ఇంద్రుడూ, యముడూ మాత్రమే పాలకులు. మీరు వారు కారు గద!' అన్నది ముసలమ్మ.

డి. దశరథరామయ్య

'కాని మేము చాలా సహనం కలవాళ్ళం కూడా,' అన్నాడు భోజరాజు. 'భూమీ, స్త్రీ మాత్రమే సహనం కలవాళ్ళు!' అన్నది ముసలమ్మ.

'మేము విరాగులం కూడా,' అన్నాడు మాఘుడు. 'విరాగులుగా చెప్పుకోతగినవి శనీ, సంతృప్తీ మాత్రమే కదా,' అన్నది ముసలమ్మ.

'మేము పరదేశీయులం!' అన్నాడు భోజరాజు. 'జీవాత్మా, చెట్టు తీసుకునే నీరూ మాత్రమే పరదేశీయమైనవి,' అన్నది ముసలమ్మ.

'అవ్వా! మేము పేదవాళ్లం,' అన్నాడు మాఘుడు.

'గొర్రెపిల్లా, ఆడపిల్లా మాత్రమే పేద వాళ్లు,' అన్నది ముసలమ్మ.

'మేము సమర్థులం,' అన్నాడు భోజ రాజు. 'సామర్థ్యం గలవి అన్నమూ, నీరూ,' అన్నది ముసలమ్మ.

'అవ్వా! మేం ఓడిపోయాం!' అన్నాడు మాఘుడు ఆమె దూకుడుకు తట్టుకోలేక.

'అప్పుల బాధ కలవాడూ, ఆడపిల్లను కన్నవాడూ తప్ప లోకంలో మరెవ్వరూ ఓడి పోరు నాయనా! ఇంతకూ మీరెవరో, ఏం కావాలో చెప్పారు కారు. చెబితే నా చేతనైన సహాయం చేద్దును,' అన్నది ముసలమ్మ.

మాఘుడు తన పాండిత్యమంతా కట్టి పెట్టి, 'అవ్వా, వీరు భోజరాజు గారు, నన్ను మాఘుడంటారు. మేము రాజనగరుకు దారి తెలియక చీకట్లో చిక్కిపోయాం,' అని చెప్పాడు.

'ఆమాట మొదటనే చెబితే సరిపో యేదిగా! ఈ దారినే నేరుగా వెళ్లండి రాజ నగరుకు చేరుకుంటారు,' అన్నది అవ్వ.

భోజరాజూ, మాఘుడూ ముసలమ్మ చెప్పిన దారినే వెళ్ళి రాజనగరుకు చేరారు. తరవాత భోజరాజు, ముసలమ్మకు అక్షర లక్షలు బహుమతి పంపించాడు.





# బలవంతపు సంగీతం

అక్బరు చక్రవర్తి ఆస్థాన గాయకుని పేరు తాన్‌సేన్. అతడు ప్రపంచ ప్రఖ్యాతి చెందిన గొప్ప గాయకుడు. అక్బరు వద్దనే బీర్బల్ అనే విదూషకుడు కూడా ఉండే వాడు. చక్రవర్తికి ప్రీతిపాత్రుడు.

ఒకనాడు బీర్బల్, చక్రవర్తి వద్దకు పోయి 'ప్రభూ! దీపకరాగం చాలా గొప్పగా ఉంటుందంటారు. అది ఒక్క సారి వినాలని ఉంది' అంటూ తన కుతూహలాన్ని వెల్లడించాడు.

అందుకు చక్రవర్తి, 'దానికేముంది? ఇప్పుడే విందువుగాని' అని చెప్పి, వెంటనే తాన్‌సేన్‌ని పిలిపించి, దీపకరాగం పాడమని ఆజ్ఞాపించాడు.

ఆకాలంలో సంగీత విద్వాంసులు దీపకరాగాన్ని ఎవరిముందూ పాడేవారు కాదు. కాని, ఏం చేయడం? ఇష్టమున్నా లేకపోయినా తాన్‌సేన్, ప్రభువు ఆజ్ఞను పాటించే తీరాలి. అందుచేత మారు ఆలోచన లేకుండా, తాన్‌సేన్ దీపకరాగాన్ని ఆలపించాడు.

ఆలపించాడే కాని, ఆ సమయాన తాన్‌సేన్ హృదయంలోపల ఒక విధమైన జ్వాల దహించి వేస్తున్నట్లుగా అనిపించింది.

తను చేసిన పొరపాటుకి అతనెంతో విచారించాడు. మనస్సులో తీరని బాధ పట్టుకున్నది. దానితో అతని ఆరోగ్యం పాడైపోయింది. ఈస్థితిలో స్వస్థత కోసం తాన్‌సేన్, చక్రవర్తి అనుజ్ఞ పొంది, గుజరాత్ ప్రాంతంలోని శబర్మతి నదీతీరానికి చేరుకున్నాడు.

ఎస్.జె.రావు

ఆ రోజులలో మొగలాయిలకు గుజరాత్ రాష్ట్రం ఆక్రమించుకోవాలని తీవ్రమైన ఆసక్తి ఉండేది. వాళ్ల భయం వమూలంగా స్త్రీలు తెల్లవారకవముందే నదికి వచ్చి, నీళ్ళు పట్టుకుపోయేవాళ్లు.

ఒకగ్రామంలో, ఇద్దరు అక్కాచెల్లెళ్ళు ప్రతి రోజూ శబర్మతి నదికి నీళ్లకోసం వచ్చేవారు. అందులో అక్క పేరు తానీ, చెల్లెలు పేరు నానీ. ఒకరోజున వారిద్దరూ నదీతీరాన కూర్చొని ఉన్న తాన్‌సేన్‌ని చూసారు.

చూచీ చూడడంతో, వారి నోటివెంబడి అప్రయత్నంగా ఈ మాటలు వెలువడినై. 'ఈయనెవరో దీపకరాగం ఆలాపించి బాధపడుతున్నట్టుందే,' అని.

ఈ మాటలు చెవిని పడటంతోనే తాన్‌సేన్‌కు మహా ఆశ్చర్యం కలిగింది. వెంటనే పరుగెత్తుకు పోయి, వాళ్లకు తన కథ అంతా వినిపించాడు. ముందు వాళ్లిద్దరూ అతనిని చూసి భయపడ్డారు. కాని, 'చెల్లీ! చెల్లీ! అని ఎంతో ఆప్యాయంగా పిలిచి తన గోడు వలబోసుకోవడంతో, వారికి తాన్‌సేన్‌పై నమ్మకం కుదిరింది.

ఆ అక్కా చెల్లెళ్లు అతడి మీద జాలి పడి వాళ్ల ఇంటికి తీసుకుపోయారు. అతను కొంచెం స్తిమితపడిన తరువాత నానీ మధురస్వరంతో మేఘమల్లార్ రాగం పాడి వినిపించింది. ఒక్కసారి కాదు అనేకసార్లు ఆమె పాడి వినిపించింది.



మేఘమల్లార్ రాగం దీపకరాగానికి విరుగుడు కావటం చేత, కొంతసేపటికల్లా తాన్‌సేన్‌ని దహిస్తూ ఉన్న మనోవ్యాధి నయమయింది.

తాన్‌సేన్ ఆరోగ్యం కుదుటపడగానే, ఆ అక్కా చెల్లెళ్ళు 'ఈ రహస్యం ఎవరికీ చెప్పను,' అని ఒట్టు వేయించుకొని అతనిని సాగనంపారు. తాన్‌సేన్ కొన్నాళ్లకు ఢిల్లీనగరం చేరాడు.

ఈ విధంగా తాన్‌సేన్ ఆరోగ్యం బాగుపడటం చూసి చక్రవర్తి చాలా సంతోషించాడు. ఇలా అతని ఆరోగ్యం కుదుటపడటానికి కారణం ఫలానా అని విద్వాంసులవల్ల తెలుసుకున్నాడు చక్రవర్తి.



అప్పటినుంచీ ఆయనకు మేఘమల్లార్ రాగం వినాలని గట్టి కుతూహలం పట్టుకున్నది.

ఇప్పుడు మేఘమల్లార్ ఆలాపించమని చక్రవర్తి తాన్‌సేన్‌కి ఆజ్ఞాపించాడు. తనకు ఆ రాగం రాదని ఎంత చెప్పినా ప్రభువు వినిపించుకోలేదు. చివరకు, తన ప్రాణరక్షణ కోసమని తాన్‌సేన్‌కి ఆ అక్కాచెల్లెళ్ల సంగతి వెల్లడించక తప్పింది కాదు. చక్రవర్తి బలవంతాన తాన్‌సేన్ ఆయనను శబర్మతీ నదీతీరానికి తీసుకువెళ్లాడు. మామూలు ప్రకారం తానీ, నానీలు నదికి వచ్చారు. వారిద్దరూ తాన్‌సేన్‌ని అతడి వెంట ఉన్న చక్రవర్తినీ గుర్తించారు.

చక్రవర్తి వారివద్దకు పరుగెత్తుకుపోయి 'అమ్మాయిలూ, ఒక్కసారి మేఘమల్లార్ పాడి వినిపించరూ?' అని వేడుకున్నాడు. కాదనలేకపోయారు ఆ అక్కాచెల్లెళ్లు. సరే, పాడటానికి ఒక సమయం ఏర్పాటు చేశాడు. చక్రవర్తి.

ప్రత్యేకంగా అలంకరించబడ్డ ఒక సభలో సరీగా ఆ సమయాన అక్కాచెల్లెళ్లు ఇద్దరూ మేఘమల్లార్ రాగం ఆలపించారు. చక్రవర్తి తన్మయుడై వారిద్దరికీ, వారి వారి భర్తల పేరిట, కోరకుండానే రెండు పెద్ద జాగీరులు వ్రాసి ఇచ్చాడు.

తానీ, నానీలు సంగీతవిద్యలో ప్రవీణులే కాదు. వారిద్దరూ సభామందిరాల్లోకి వచ్చినవారుకాదు. చక్రవర్తి ఆజ్ఞను మీరలేక వారు నిండు సభలో పాట పాడవలసి వచ్చింది. అలా సభలో పాడటం తమవంటి స్త్రీలకు తగిన పని కాదని, అది తమ సౌశీల్యానికి భంగకరమనీ వారి నమ్మకం. అందుచేత సభకు బయలుదేరేముందే వారిద్దరూ తగిన ఏర్పాట్లు చేసుకువచ్చారు.

సభ ముగిసింది. చక్రవర్తి వారిని మెచ్చుకోవటం, బహుమతి ఇవ్వటం జరిగింది. అప్పుడే ఆ అక్కా చెల్లెళ్లు, వెంట తెచ్చుకున్న కత్తులతో ఒకరినొకరు పొడుచుకుని నేలకు ఒరిగారు. ఈ ఘోర దృశ్యం చూస్తూనే తాన్‌సేన్ మూర్ఛపోయాడు.

తరువాత తానీ, నానీల భర్తలు అక్కడికి వచ్చారు. వారిముందు చక్రవర్తి తల ఎత్తలేకపోయాడు. తను అనాలోచితంగా చేసిన పని రెండు నిండు ప్రాణాలను బలిగొన్నదే అని విచారించాడు.

అక్కాచెల్లెళ్ళు సభకు పోయేముందే వారి భర్తల పేర వేరుగా ఉత్తరాలు వ్రాసి ఉంచారు. ఆ ఉత్తరాలలో ఇలా ఉంది.

'మొగల్ చక్రవర్తి ఆజ్ఞను శిరసావహించడానికి నిండు సభలో మేము పాడవలసి వచ్చింది. ఇలా పదిమందిలో పాడటం మా సౌశీల్యానికి మచ్చగా మేము భావిస్తున్నాము. అందుచేత, ఈ శరీరాలను ఆహుతి చేయడమే సరైన పని అని మాకు తోచింది. స్వర్గలోకంలో మనం కలుసుకుందాం. శెలవు..'

తాన్‌సేన్ వారిని జన్మలో మరిచిపోలేకపోయాడు. మేఘమల్లార్ రాగాలాపన చేసి ఆ అక్కాచెల్లెళ్లు తనను మృత్యువు నుంచి కాపాడారు. కాని తన వాగ్దాన భంగం వల్ల ఆ ఇద్దరూ మృత్యువుపాలయారు. తానీ, నానీల మరణానికి తనే కారణం అని ఎంతగానో దుఃఖించాడు తాన్‌సేన్. వారిద్దరి పేర్లూ చిరస్థాయిగా ఎలా ఉంటాయా అని ఆలోచించాడు.

ఇందుకుగాను సంగీత స్వరాలలో ఎక్కడెక్కడ 'ఓం' అనే అక్షరం వస్తుందో, అక్కడక్కడల్లా 'తోమ్ తానా నానా' అని తన పాటలలో ప్రయోగిస్తూ వచ్చాడు. అదే పద్ధతి ఇప్పటికీ సంగీత శాస్త్రంలో ప్రచారంలో ఉంటున్నది. ఈ విధంగా తాన్‌సేన్ ఆ అక్కాచెల్లెళ్ళకు అమరత్వం కలిగించాడు.

అంతేకాక, వారి జ్ఞాపకార్థం వారిని తను ప్రప్రథమంగా చూసిన ప్రదేశంలో ఒక సంగీత మందిరం నిర్మించాడు. అది ఇప్పటికీ అహ్మదాబాద్ నగరంలో ఆలిస్ వంతెన పక్కన శిథిలావస్థలో ఉంది.






# బోయవాడి నిబ్బరం

ఒకానొకప్పుడు పార్వతీపరమేశ్వరులు కాశీ పట్టణం మీదుగా విహారం బయలుదేరారు. అక్కడ వేలకొద్దీ ప్రజలు గంగా నదిలో స్నానం చేస్తున్నారు. కొందరు విశ్వేశ్వరుణ్ణి దర్శించుకొంటున్నారు. కానుకలు సమర్పిస్తున్నారు, భజనలు చేస్తున్నారు.

ఇదంతా చూసి, పార్వతీదేవి భర్తతో, 'నాథా! ప్రతిరోజూ నిన్ను సేవించుకోటానికి ఇందరు భక్తులు ఈ కాశీపట్టణానికి వస్తున్నారు కదా, వీరంతా నీ సాన్నిధ్యం పొందిన వారేనా? ఇందరూ కైలాసం చేరుకుంటే కైలాసం సరిపోతుందా?' అని అడిగింది.

అందుకు పరమశివుడు, 'అమాయకురాలా! కాశీకి వచ్చిన ప్రతివాడూ కైలాసం చేరుకుంటాడనేనా నీ ఉద్దేశం? పుణ్యక్షేత్రాలు దర్శించకపోయినా నా సాన్నిధ్యం పొందవచ్చును. నా సన్నిధికి రాగలవాడు ఎటువంటివాడు అయి ఉండాలో ప్రత్యక్షంగా చూపిస్తాను,' అన్నాడు.

పార్వతీ పరమేశ్వరులు వృద్ధదంపతుల రూపంలో విశ్వేశ్వరుని దేవాలయం దగ్గిరకి చేరుకుని అక్కడ ఒక మర్రిచెట్టు కింద కూర్చున్నారు.

అవసానదశలో ఉన్న వృద్ధుడిలా శివుడు బాధపడసాగాడు. విశ్వేశ్వరుని దర్శనం కోసం ఎందరో భక్తులు ఎక్కడెక్కడినుంచో వస్తూ ఉన్నారు.

వారిలో కొందరు ఈ వృద్ధ దంపతులకేసి చూడనేలేదు. మరికొందరు చూసి చీదరించుకు వెళ్లిపోయారు.

ఇంతలో ఒక యాత్రికుడు వచ్చాడు. అతణ్ణి చూసిన వృద్ధురాలు, 'బాబూ!

వి. మార్కండేయరావు

ఇతడు నా భర్త. చావడానికి సిద్ధంగా ఉన్నాడు. కాసిన్ని నీళ్లు గొంతుకలో పోసి పుణ్యం కట్టుకోండి,' అని ప్రార్థించింది.

అందుకు ఆ యాత్రికుడు విసుక్కుని 'ఎక్కడ చూసినా ముష్టివాళ్లే, మీకు అందరికీ నీళ్లు పోస్తూ కూర్చుంటే ఇక అయినట్లే, బోలెడు డబ్బు ఖర్చుచేసుకుని ఇక్కడికి వచ్చినది మీ గొంతుకల్లో నీళ్లు పోయడానికేనా?' అంటూ వెళ్ళిపోయాడు.

మరి కాస్సేపటికి మరొక పరమభక్తుడిలాంటి వాడు వచ్చాడు. వృద్ధురాలు కోరడంతోటే దయతలిచి, గంగాతీర్థం పోయబోయాడు.

కాని, ఇంతలోకే వృద్ధురాలు 'ఇదిగో నాయనా! నువ్వు నీళ్ళు పోసి నా భర్త దాహం తీర్చటానికి ముందు ఒక నియమం ఉన్నది. విను, నీవు జ్ఞానంవచ్చిన తర్వాత ఏ పాపమూ చేయకుండా ఉండాలి. అలాగయితేనే తీర్థం పొయ్యి. అబద్ధం ఆడకు. నువ్వు అబద్ధం ఆడినట్లయితే నా భర్త చనిపోతాడు. ఆ పాపం నీకు చుట్టుకుంటుంది, అని చెప్పింది.

ఆ మాటలు విని, 'పూటకి గతిలేని వాళ్లు. వీళ్లకి నియమం ఒకటా? అయినా ఒకవేళ ఈ ముసలివాడు చస్తే ఆ పాపం నిష్కారణంగా నన్ను చుట్టుకుంటుందే. తీరికూర్చుని వీళ్లకి ఉపకారం చెయ్యబోయి అపకారం కొని తెచ్చుకోవడమవుతుందే' అని విసుక్కుంటూ ఆ భక్తుడు




తన దారిని తను వెళ్ళిపోయాడు. మళ్లా కొన్ని గంటలవరకు ఏ తీర్థయాత్రికుడూ ఆ వృద్ధులకు సాయం చేయడానికి దగ్గరకు రానేలేదు.

తరవాత ఒక బోయవాడు విశ్వేశ్వరుణ్ణి దర్శించుకుని ఆ దారిని వచ్చాడు. వృద్ధురాలి దీనాలాపన విని వృద్ధుడి గొంతుకలో గంగాజలం పొయ్యబోయాడు. కాని, వృద్ధురాలి వింత షరతు విని వాడూ మొదట ఆశ్చర్యపోయాడు.

కాని మరొకసారి ఆ వృద్ధుల ముఖాలలోకి చూశాడు. వెంటనే వాడికి ఏదో ఒక దివ్యతేజస్సు కనబడుతున్నట్టు తోచింది.

'బోయవాడు ఇలా అనుకున్నాడు. పుట్టినప్పటినుంచి ప్రతి మానవుడూ ఏదో

పాపం చేస్తూనే ఉంటాడు. పాపం చెయ్యనివాడంటూ ఎవడూ లేడు.

నేను బోయలలో పుట్టాను. ఆ వృత్తి జీవహింస. భగవంతుడు నాకు కల్పించిన వృత్తే అది. ఈశ్వరుడు కల్పించిన వృత్తికి నేను బాధ్యుణ్ణి కాదుగదా! అయితే ఈ వృద్ధులు సామాన్యులుగా కనిపించడం లేదు. సామాన్యులైతే ఈ దివ్య తేజస్సు ఉండదు. వీరు నిశ్చయంగా ఎవరో మహనీయులు.

పోతే ఇప్పటివరకు నేను చేసి ఉన్న పాపాలు తొంబైతొమ్మిది! ఈ దంపతులు సామాన్య మానవులే ఐతే నేను పోసే తీర్థం వల్ల ఈ వృద్ధుడు చనిపోతాడు. నేను చేసిన తొంభైతొమ్మిది పాపాలతో కలిసి ఇది నూరవది అవుతుంది.

అలాకాక వీరు ఎవరో మహనీయులే అయితే నా పాపాలన్నీ హరించిపోయి, తరిస్తాను,' అనుకున్నాడు.

ఈ నిశ్చయంతో వాడు వృద్ధుడి నోరు తెరిచి, గంగాతీర్థం పోశాడు. ఆ క్షణమందే వృద్ధదంపతులు మాయమై వారి స్థానంలో పార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరించారు.

అప్పుడు పరమేశ్వరుడు పార్వతితో, 'చూశావా, ఈ బోయవాడి గుండెనిబ్బరం? వీడు నన్నే నమ్ముకొని ఉన్నాడు. పవిత్రమైన హృదయం కలిగి ఉండటం చేత తన పాపాలన్నీ మన దర్శనం వల్ల పోగొట్టుకున్నాడు.

ఇటువంటి వాళ్ళే కైలాసంలో ఉండటానికి అర్హులు. నిజమైన భక్తులు. కాని, ఉత్తుత్తి పూజలు చేసేవాళ్లంతా భక్తులు కారు. వాళ్లు నా సాన్నిధ్యం పొందలేరు,' అని చెప్పాడు. తరువాత బోయివాణ్ణి దీవించి అక్కడినుంచి అంతర్ధానమయ్యాడు.

ఆ క్షణంలోనే బోయవాడికోసం ఒక పుష్పక విమానం వచ్చి, అతణ్ణి దేవలోకానికి తీసుకుపోయింది.





# అమృత ధార

ఆ పల్లెటూళ్లో... పన్నెండేళ్ల సుబ్రహ్మణ్యం మర్నాటి సైన్సు పరీక్ష కోసం అరుగుమీద కూర్చుని చదువుకుంటున్నాడు. తల్లి లక్ష్మి పాలగ్లాసు తీసుకువచ్చి కొడుక్కి అదిం చింది. 'అమ్మా! నాకు ఈ పాలొద్దమ్మా! ఏం బాగులేవు.' అన్నాడు సుబ్రహ్మణ్యం.

'మన సురభి పాలిచ్చినంతకాలం మారు మాట్లాడకుండా తాగేసేవాడివి. అది కాస్తా వట్టిపోయింది. రెండో పెయ్యను తెచ్చేదాకా బయట కొన్న పాలు తాగక తప్పదు కదా!' అంది లక్ష్మి కొడుకు తల నిమురుతూ.

'అమ్మాయి లక్ష్మీ.. సురభికిమేత పెట్టావా అమ్మా? ఆకలితో అరుస్తూన్నట్లుంది,' అన్నారు సుబ్రహ్మణ్యం తాత వెంకయ్య.

'ఆకలి కాదు... దాని మనసులో ఏం గుబులు పుట్టిందో ఏమో ఇవాళ పొద్దుటి నుంచీ అది గడ్డిని ముట్టలేదు మామయ్యా,' అంది లక్ష్మి.

'మన సుబ్రహ్మణ్యం పుట్టినప్పుడు తెచ్చుకున్న గోవమ్మా అది. ఇప్పుడంటే వట్టిపోయింది గాని, మొన్నమొన్నటిదాకా నాలుగు శేర్ల పాలిచ్చింది కదా మరి.'

'నాన్నా! అప్పలరాజుతో బేరం కుదిరింది. సురభికి వెయ్యి రూపాయల కంటే ఇవ్వ నంటున్నాడు. సాయంత్రం వచ్చి తోలుకు పోతానంటున్నాడు,' అన్నాడు సుబ్రహ్మణ్యం తండ్రి నరసింహం ఇంట్లోకి అడుగు పెడుతూ.

అరుగుమీద చదువుకుంటున్న సుబ్ర హ్మణ్యం ఉలిక్కిపడ్డాడు. 'అదేంటి నాన్నా మన సురభిని అమ్మేస్తున్నారా?' అన్నాడు బాధగా. 'ఏం చెయ్యమంటావురా కన్నా.. ఆరునెలలుగా దానిమీద ఖర్చు తప్ప రాబడి లేదు మరి. పైగా ముసలిది. పశువుల కొట్టాంలో చోటు కూడా దండగ.'

'అదేంటి నాన్నా.. ఇన్నాళ్లూ మనకి పాలు, పెరుగు, వెన్న, నెయ్యి ఇచ్చి మనం పొలం

పి.వి. శేషారత్నం



కొనుక్కొని ఈ ఇల్లు కట్టుకోవడానికి సాయం చేసింది కదా..' అన్నాడు సుబ్రహ్మణ్యం.

'చేసింది లేరా.. కానీ ఇప్పుడు దానికి పాలిచ్చే వయసూ లేదు. మనకు దానిని పోషించే అవసరమూ లేదు' అన్నాడు తండ్రి. తండ్రి స్వార్థం వాడికి నచ్చలేదు. అయితే అప్పలరాజు మాత్రం దానిని ఏం చేసుకుంటాడు? సుబ్రహ్మణ్యం కంఠంలో సందేహం.

'ఏం చేస్తాడు.. దాని మాంసం, చర్మం అమ్ముకుంటాడు. అయినా అదంతా మన కెందుకులే.' అన్నాడు నరసింహం పూర్తిగా చెప్పడం ఇష్టం లేక. ఉలిక్కి పడ్డాడు సుబ్రహ్మణ్యం. 'అన్నీ మనకెందుకులే అనుకుంటే ఎలా నాన్నా.. మా సైన్సు మాస్టారేం చెప్పారు? మనిషి తన కూడు గుడ్డ గూడు వరకే చూసుకుని పరిసరాలను మర్చిపోతే ప్రకృతి వైపరీత్యాలు కూడా చోటు చేసుకుంటాయిట మీకు తెలుసా?'

'అంటే ఏమవుతుందట.' కొడుకు మాటలు అర్థం కాలేదు నరసింహానికి.

'ఏముంది? వ్యాధులు బాధిస్తాయి. మన ప్రాణాలు తీసుకుంటాయి. పర్యావరణ సమతుల్యం అనేది మన చుట్టూ ఉన్న జీవ జాలానికి సంబంధించినదే కదా. నాన్నా.. మనదేశంలో 20 శాతం క్షీరదాలు అంతరించిపోయే దశలో ఉన్నాయట. రామచిలుకలు, ఊరపిచ్చుకలు, పెద్దపులుల సంఖ్య తగ్గిపోవడం నీకు మాత్రం తెలియదా? మన వినాశాన్ని మనమే కొని తెచ్చుకుంటే ఎలా నాన్నా?'

'అయితే ఇప్పుడేమంటావురా?' కొడుకు పెద్ద మాటలు మాట్లాడుతుంటే కోపం రావడం లేదాయనకు.

సుబ్రహ్మణ్యం అందుకున్నాడు. 'ఒక్క విషయం చెప్పు. ముసలితనం మనిషికీ, జంతువుకీనూ ఒకటే కదా... మన తాతయ్య కూడా ముసలివాడైపోయాడు కదా మరి తాతను ఏం చేద్దాం?'

'అదేం మాటరా. మా అమ్మ పురిట్లోనే చనిపోతే నన్ను పెంచి పోషించి ఇంతవాడిని చేసిందాయనే,' తండ్రి మాట్లలో బేలతనం కనిపించింది సుబ్రహ్మణ్యానికి.

'మరి మనిషికో న్యాయం. నోరులేని జంతువుకో న్యాయమూనా నాన్నా? మరి నాకు అమ్మ దగ్గర పాలు చాలడం లేదనే మన సురభిని కొన్నానని ఎన్నోసార్లు చెప్పావు కదా నాన్నా.. నన్ను ఇన్నాళ్లూ తల్లిలా పాలిచ్చి ఇంత చేసిన మరో అమ్మ కదా సురభి. ఇవాళ

ముసలిదయిపోయిందని.. కటికవాడికి అమ్మేయడం ఎంతవరకు న్యాయం? రేపు నువ్వూ ముసలివాడివవుతావు. నేనూ అవు తాను మరి మనల్ని కూడా...'

నరసింహం విలవిల్లాడిపోయాడు. 'ఇక చెప్పకురా కన్నా! పసివాడివయినా నా కళ్లు తెరిపించావు. ఇకమీదట మన సురభి నా తల్లే అనుకుంటాను. అది గుప్పెడు గడ్డి తింటే నా ఆస్తులేమీ తరిగిపోవులే. ఉండు. అప్పల్రాజుకి రావద్దని చెప్పొస్తాను.' అంటూ నరసింహం బయటకి వెళ్లిపోయారు.

వెంకయ్య గారు ఆనందంగా కళ్లు తుడు చుకుని మనవడిని కౌగిలించుకున్నారు, 'నా మనవడిననిపించావురా కన్నా,' అంటూ.

'మామయ్యగారూ... అయితే ఇదంతా తాతా మనవళ్ల గూడుపుఠాణీ అన్నమాట,' అంది ఆనందంగా లక్ష్మి.. ఆమెకీ సురభి అంటే ప్రాణం.

'అవునమ్మా! నోరులేని జంతువైనా మన సురభిని అలా అమ్మడం సరికాదు అని నేను రాత్రంతా నిద్రపట్టక దొర్లుతూ ఉంటే నా మనవడు నా మొరాలకించి ఈ విధంగా మాట్లాడి తండ్రి మనసు మార్చేశాడు.'

'తాతయ్యా! ప్రపంచంలో జంతుకోటి సంక్షేమం మాట ఎలాగున్నా.. కనీసం మన చుట్టూ ఉన్న మనకి కనిపిస్తున్న.. మనకి సహకరిస్తున్న.. మన సహచర జంతుకోటి సంక్షేమానికి కృషి చెయ్యడం మన కనీస ధర్మం అని మా సైన్స్ మాస్టారు చెప్పారు. ఇలా ఒక్క ప్రాణిని కాపాడటం ద్వారా అయినా నా వంతు బాధ్యత నేను నెరవేర్చి నట్లే కదా తాతయ్యా?'

'నా మనవడు ఎంత ఎదిగిపోయాడో చూసావమ్మా! పిల్లలంతా నామనవడిలా ఆలోచిస్తే ప్రపంచానికేం ఢోకా లేనట్లే..' అన్నారు వెంకయ్య సాలోచనగా.

'నిజమే మామయ్య గారూ! మరి వాడు మన సురభి అమృత పాలధారతో పెరిగిన పిల్లాడు కదా!' అంటూ పశువుల కొట్టాం లోని సురభి గంగడోలు నిమురుతూ దాని నోటికి ప్రేమగా గడ్డిపరకలందిస్తున్న కొడు కును గర్వంగా చూసింది లక్ష్మి.



# నమ్మకం

పెళ్ళై కొత్తగా కాపురానికొచ్చిన శ్యామలకి అత్త జయమ్మ బొత్తిగా నచ్చలేదు. ఆ విషయం తనను చూడవచ్చిన మేనమామకు చాటుగా చెబితే ఆయన, 'మీ అత్త మంచిని మెచ్చుకుం టుందని విన్నాను. మరి నిన్ను దేనికీ మెచ్చుకోదా?' అనడిగాడు ఆశ్చర్యంగా.

'మెచ్చుకుంటుంది కానీ రోజుకు నాలుగైదుసార్లైనా నాలో లోపాలెన్నుతుంది,' అంది శ్యామల.

'మరి మీ అమ్మైతే– రోజుకు పదిసార్లు నీలో లోపాలెన్నేదని గుర్తు,' అన్నాడు మేనమామ.

'ఔననుకో– కానీ లోపాలు ఎన్నినా, తన్నినా అమ్మ అమ్మే కదా!' అంది శ్యామల.

'ఐతే– మీ అత్త నీకిష్టమైన వంటకాలు చెయ్యనివ్వదా?' అనడిగాడు మేనమామ.

'చెయ్యనిస్తుంది కానీ పూటకి ఓ వంటకం నాకిష్టం లేనిది చేయిస్తుంది.' అంది శ్యామల.

'మరి మీ అమ్మైతే– పూటకిరెండు వంటకాలు నీకిష్టం లేనివి చేసేది,' అన్నాడు మేనమామ.

'ఔననుకో– కానీ పెట్టినా మొట్టినా అమ్మ అమ్మే కదా!' అంది శ్యామల.

'పోనీ మీ అత్తపనులన్నీ నీకు అప్పచెప్పి తను ఖాళీగా కూర్చుంటుందా?' అడిగాడు మేనమామ.

'కూర్చోదు కానీ– తను కూర్చోనప్పుడు నన్నూ కూర్చోనివ్వదు,' అంది శ్యామల. మరి 'మీ అమ్మైతే– తను కూర్చున్నప్పుడు కూడా నిన్ను కూర్చోనిచ్చేది కాదేమో' అన్నాడు మేనమామ.

'ఔననుకో– కానీ కూర్చోపెట్టినా నిలబెట్టినా అమ్మ అమ్మే కదా!' అంది శ్యామల.

అలా మరికొన్ని ప్రశ్నలు వేశాక మేనమామ శ్యామలతో, 'నీ సమస్యకు చాలా సులభ పరిష్కారం చెబుతున్నా విను. అత్త కూడా అమ్మే కదా అనుకో!' అన్నాడు. – వసుంధర






# శిథిలాలయం –20

*(శిఖిముఖీ, విక్రమకేసరీ ఇద్దరు అనుచరులతో బ్రహ్మపుత్రానదీ లోయలకు బయలు దేరారు. వాళ్లు కామాఖ్య నగరం చేరి ఒక సత్రంలో విడిది చేశారు. వాళ్లు లేని సమయంలో పూజారి వాళ్లుండే మిద్దెమీది గోడలో ప్రవేశించాడు. శిఖిముఖి అతణ్ణి పట్టుకోవాలని ప్రయత్నిస్తే, పిట్టగోడ దూకి గుర్రం మీద పారిపోసాగాడు. తరువాత--)*

సత్రం ముందు పెద్ద కలకలం రేగింది. ఇద్దరూ హడావుడిగా గుర్రాల మీద పారి పోతూండటం, కత్తులు దూసిన యువ కులిద్దరూ, 'ఆగండి!' అంటూ వాళ్లకేసి పరుగెత్తుతుండటం చూసి, సత్రంలో విడిది చేసినవాళ్లు చాలామంది ఆవరణలోకి పరి గెత్తుకొచ్చారు.

అజితుడూ, వీరభద్రుడూ వేగంగా పూజారీ వాళ్ల వెనుక కొంతదూరం పరిగె త్తారు. కాని, గుర్రాల మీద పారిపోతున్న అతణ్ణి, సవర భేరుండాన్ని పట్టుకోవటం వాళ్లకు సాధ్యమయేపని కాదు.

శిఖిముఖీ, విక్రమకేసరీ తమ గది తలుపు బంధించి మిద్దెమీది నుంచి కిందికి దిగి వచ్చారు. ఆ సరికి అజిత వీరభద్రులు రొప్పుతూ వాళ్ల దగ్గిరకు వచ్చి, పూజారి దొరకలేదని చెప్పారు. ఆ దుర్మార్గుడిని చేజిక్కించుకునే అవకాశం కొద్దిలో విఫల మైనందుకు, శిఖిముఖి విచారపడ్డాడు.

అంతపెద్ద ఎత్తు మిద్దె మీది నుంచి పూజారి కిందికి దూకుతాడని అతడు అను మానించలేకపోయాడు. సవరభేరుండం కింద కాచుకుని ఉన్న సంగతి అతడికి తెలియదు.

దాసరి సుబ్రహ్మణ్యం



'శిఖీ! ఈ దుర్మార్గుడి బెడద మనకు వదిలేలా లేదు. మనం వాడితో తెలివి తక్కువగా మాటలు పెట్టుకున్నాం. గదిలో ప్రవేశిస్తూనే వాణ్ణి కత్తితో నరకవలసింది,' అన్నాడు విక్రమకేసరి.

'అవును. ఈసారి వాడు తటస్థపడితే మనం చేయబోయేది అదే. ఆ నీచుడితో మనకు మాట లేమిటి?' అన్నాడు శిఖి ముఖి. అక్కడ చేరినవాళ్లు శిఖిముఖినీ, విక్రమకేసరినీ రకరకాల ప్రశ్నలు అడగసా గారు. ఎవరో ఇద్దరు, పెద్ద దొంగతనం చేసి గుర్రాల మీద పారిపోయారని వాళ్లనుకు న్నారు.

సత్రపు యజమాని చేతులు నలుపు కుంటూ నంగిగా, 'అయ్యా, ఇందులో నా పొరపాటు చాలా ఉన్నది. మీరు లేనప్పుడు, ఆ పూజారినని చెప్పినతణ్ణి మీ గదిలోకి పోనివ్వవలసింది కాదు. విలువగల వస్తువు లేమైనా ఎత్తుకుపోయాడా?' అని అడిగాడు.

'వాడిక్కావలసిన విలువైన వస్తువులేవీ మా దగ్గిర లేవు. మేము యాత్రికులం, పుణ్యతీర్థాలు సేవించేందుకు బయలు దేరిన వాళ్లం. మా దగ్గిర విలువైన వస్తు వులేం ఉంటవి?' అన్నాడు శిఖిముఖి.

'తమ గదిలో దొంగతనం జరగలేదని వినటం నాకు చాలా సంతోషం కలిగిస్తు న్నాది. ఆ పూజారి ముఖలక్షణాలు చూస్తే, ఇభ్యుజాతి వాడిలా ఉన్నాడు. వాళ్లెంత నమ్మకస్థులో అంత నమ్మక ద్రోహులు,' అన్నాడు సత్రం యజమాని.

ఆ రాత్రి శిఖిముఖీ, విక్రమకేసరీ సంప్ర తించుకుని బ్రహ్మపుత్రానదీ లోయల్లో ఇభ్యుజాతి వాళ్లుండే ప్రాంతాలకు దారి చూపగల వాణ్ణొకణ్ణి కుదుర్చుకోవడం మంచిదని నిశ్చయించారు. పెద్దమనిషిలా కనబడుతున్న సత్రం యజమానితో ఈ మాట చెబితే, అతడు ఆశ్చర్యపడి, 'ఆ ప్రాంతాలకు పోవటం అంత క్షేమకరం కాదు,' అన్నాడు.

శిఖిముఖి ఆ మాటకు చిన్నగా నవ్వి, 'మాకు ప్రాణాపాయం కలగవచ్చనే కదా మీరు భయపడుతున్నది. అలాంటి భయం మాకేం లేదు. మమ్మల్ని చంపినం దువల్ల ఎవరికీ ఒరిగేదేం ఉండదు. ఆ

లోయల్లోని చిన్నా పెద్దా పవిత్ర స్థలాలన్నీ చూడదలిచాం. ముఖ్యంగా ఇభ్యుజాతి వాళ్లుండే ప్రాంతాల అతి పురాతనమైన దేవాలయాలున్నవని విన్నాం. ఎంత కష్ట నష్టాలకైనా సరే ఓర్చి వాటన్నిటినీ తప్పక దర్శించి తీరాలి,' అన్నాడు.

'అయితే మీ యిష్టం. మీ ప్రయాణం ఎప్పుడో చెప్పండి. ఆ ప్రాంతాలు బాగా తెలిసిన వాణ్ణొకణ్ణి మీ వెంట పంపుతాను. వాడికి తిండీ తిప్పలూ మీరే చూడాలి. తిరిగి వచ్చింతర్వాత పారితోషికంగా కొంత డబ్బు ఇవ్వవలసి ఉంటుంది.' అన్నాడు, సత్రం యజమాని.

శిఖిముఖీ, విక్రమకేసరీ అందుకు అంగీకరించారు. మర్నాడు సూర్యోదయం వేళ పొట్టిగా గున్న ఏనుగు పిల్లలా ఉన్న ఒక నడి వయసువాణ్ణి, సత్రం యజమాని వాళ్ల దగ్గిరకు తీసుకువచ్చి, 'అయ్యా, ఇతడి పేరు జాంగ్‌లా. ఇభ్యుజాతి వాళ్ళుండే ప్రాంతాలన్నీ తనకు బాగా తెలుసునంటు న్నాడు. ఇతడూ ఆ జాతివాడే' అని చెప్పాడు.

శిఖిముఖి అతణ్ణి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు. మనిషి ముఖం చూసి స్వభావాన్ని కనిపెట్టేందుకు అతడికి సాధ్య మయేలా కనిపించలేదు. జాంగ్‌లా పెదాల మీద చిరునవ్వు కదులుతున్నది. ముఖం మీద ఎలాంటి భావం ప్రస్ఫుటం కాలేదు. ఎండ వానలకు గురై, బాగా బీటలు బారిన నల్ల రాతిపలకలా ఉన్నది అతడి ముఖం.




జాంగ్‌లాను పరిచయం చేసి సత్రం యజమాని వెళ్లిపోగానే, శిఖిముఖి అత డితో, 'నీవు నమ్మకస్తుడివా కావా అన్న భయం మాకు లేదు. మేం నలుగురం, నువ్వొక్కడివి. కాని, నీకు ఇభ్యుజాతి వాళ్లుండే ప్రాంతాలు క్షుణ్ణంగా తెలుసునా అన్నదే నా కనుమానంగా ఉన్నది,' అన్నాడు.

'నేనెంత నమ్మకస్థుణ్ణో మీరే తెలుసు కుంటారు. పోతే, నేను పుట్టి పెరిగింది ఇభ్యుజాతి వాళ్లుండే ప్రాంతానే. నేను ఆ జాతివాణ్ణేనని సత్రం యజమాని తమకు చెప్పాడు గదా? ఆయన నన్నుబాగా ఎరుగు,' అన్నాడు జాంగ్‌లా.

'సరే, నీకు దారిభత్యం మేమే జరు పుతాం. ప్రయాణం ముగిసి తిరిగి ఈ




కామాఖ్య నగరం చేరింతరవాత, నీకు పారి తోషికంగా అయిదు బంగారు కాసులిస్తాం. ఇష్టమేనా? ఆలోచించుకుని చెప్పు,' అన్నాడు శిఖిముఖి. 'ఆలోచనెందుకు, తమ దయ.' అన్నాడు జాంగ్‌లా.

'మమ్మల్ని ఆ లోయల్లోని గోల్ భరా అన్న ఇభ్యుజాతి గ్రామం చేర్చాలి. ఆ దాపుల్లో ఎక్కడో అతిపురాతనమైన ప్రసిద్ధ దేవాలయం ఉన్నదని విన్నాం,' అన్నాడు శిఖిముఖి.

గోల్‌భరా అన్న పేరు వింటూనే జాంగ్‌లా కొంచెం ఉలిక్కిపడి, 'చిత్తం, అలాగే అక్కడికి దారి చూపుతాను, ఆ గ్రామం నేనెరిగినదే. కాని మీరన్నట్టు అక్కడ ప్రసిద్ధ దేవాలయం ఏమీ లేదు. తరవాత నన్ను తప్పు పట్టకుండా ముందే, ఉన్న సంగతి తమకు మనవి చేసుకుంటున్నాను,' అన్నాడు.

'ఉన్నట్టు మేం విన్నాం, అవునా, కేసరీ?' అంటూ శిఖిముఖి విక్రమకేసరి కేసి చూసి, అతడు అవునన్నట్టు తల ఊపగానే, జాంగ్‌లాతో, 'నువ్వు మాకు ఆ గ్రామానికి దారి చూపు. అక్కడికి చేరింతరవాత సంగతి మేం చూసుకుంటాం. ప్రయాణం ఈ సాయంకాలమే. సిద్ధంకా,' అన్నాడు.

జాంగ్‌లా వాళ్లకు నమస్కరించి వెళ్లిపోయాడు. ఆ సాయంత్రం తమకు దారిలో అవసరం అయిన ఆహారపదార్థాలనూ, ఇతర సామగ్రినీ రెండు కంచరగాడిదల మీద వేసుకుని, శిఖిముఖీ, విక్రమకేసరీ నదీలోయల కేసి నింపాదిగా బయలు దేరారు. జాంగ్‌లా వాళ్లకు ముందు నడుస్తూ దారి చూపసాగాడు.

చీకటిపడుతూనే అందరూ అరణ్యంలోని ఒక చిన్న కొలను ప్రాంతం చేరారు. ఆ రాత్రికి అక్కడ ఆగి, వంట చేసుకుని, మర్నాటి వేకువజామున తిరిగి ప్రయాణం కావడానికి వాళ్లు నిశ్చయించుకున్నారు. వంటపనిలో అజితుడూ, వీరభద్రుడూ నిమగ్నులయ్యారు. జాంగ్‌లా ఎండు పుల్లలు తీసుకువస్తానని శిఖిముఖితో చెప్పి, అరణ్యంలోకి పోయాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ ఒక చెట్టు నానుకుని కూర్చుని తమ ముందు కార్య

క్రమాన్ని గురించి మాట్లాడుకోసాగారు. విక్రమకేసరికి, జాంగ్‌లా మీద పూర్తి నమ్మకం కలగలేదు. వాడు తమను తప్పు దారి పట్టిస్తాడే అన్న అనుమానం అతడు బయటపెట్టాడు. శిఖిముఖినీ ఇలాంటి అనుమానమే అప్పుడప్పుడూ పీడిస్తున్నది.

'మన జాగ్రత్తలో మనం ఉందాం. ఈ జాంగ్‌లా, శిథిలాలయ పూజారి అనుచరుడేమో అనే గదా నీ భయం. ఆ దుర్మార్గుడే మనను ఏమీ చేయలేనప్పుడు, ఈ వెధవ చేయగలిగిందేమిటి?' అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఏదో జవాబు చెప్పబోయేంతలో, ఎర్రగండు చిన్నగా మొరిగి, దాపుల ఉన్న గుబురు చెట్లకేసి బయలు దేరింది. శిఖిముఖి కుక్క వాలకం చూసి విక్రమకేసరిని హెచ్చరించి, దాని వెనకనే నిశ్శబ్దంగా నడిచాడు. విక్రమకేసరి కత్తి దూసి నిలబడి, చుట్టూ అలముకుంటున్న చీకటిలోకి గుచ్చి గుచ్చి చూడసాగాడు.

ఎర్రగండు చెట్లలో కొంత దూరం ముందుకు పోయి, ఒకచోట ఆగి, తల పైకెత్తి మొరగ సాగింది. నేలకు దాదాపు అయిదారడుగుల ఎత్తులో దట్టంగా పరుచుకుపోయిన చెట్లకొమ్మల కేసి, శిఖిముఖి పరీక్షగా చూశాడు. అక్కడ శత్రువెవడైనా దాగి ఉన్నాడేమో అని సంశయం అతడిక్కలిగింది.. కాని అక్కడ ఎవరూ ఉన్నట్లు లేదు. అంతలో అతడికి దూరంగా ఎవరో చిన్నగొంతుతో మాట్లాడుతున్నట్లు అను



మానం కలిగింది. అతడు ముందుకు నడవబోయాడు. ఎర్రగండు అతడి దారిని అడ్డగిస్తూ తల పైకెత్తి పెద్దగా మొరగటం ప్రారంభించింది.

ఈసారి శిఖిముఖికి అడుగుల చప్పుడు స్పష్టంగా వినబడింది. చూస్తూండగానే జాంగ్‌లా భుజం మీద ఇన్ని ఎండు పుల్లలు పెట్టుకుని వేగంగా అతడి కేసి రాసాగాడు. శిఖిముఖి అతడి కేసి రెండడుగులు వేసేంతలో చెట్లకొమ్మల్లోంచి ఒక పెద్ద కొండ చిలువ రపీమంటూ జాంగ్‌లా మీద పడి అతడి శరీరాన్ని బలంగా చుట్టివేయసాగింది. ఎర్రగండు పెద్దగా అరుస్తూ ముందుకు దూకింది. జాంగ్‌లా ఒక చావు కేక పెట్టాడు.

శిఖిముఖి ఓ క్షణం పాటు కొయ్యబారి పోయాడు. మరుక్షణంలో అతడికి జాంగ్‌లా ఎలాంటి ఘోర ప్రమాదంలో చిక్కుకు న్నాడో అర్థమైంది. అతడు పరిగెత్తుకుంటూ పోయి కొండచిలువ తల నరికేందుకు కత్తి దూశాడు. కాని, కొండచిలువ జాంగ్‌లాను నడుము నుంచి పైన తన దేహంతో బలంగా చుట్టి అతడి తలను ఒడిసి పట్టుకునేం దుకు ప్రయత్నిస్తున్నది. ఆ చీకట్లో కత్తి గురి ఏమాత్రం తప్పినా కొండ చిలువ తలకు మారుగా జాంగ్‌లా తన తెగి కింద పడే ప్రమాదం ఉన్నది.

జాంగ్‌లా ఉక్కిరిబిక్కిరై పోతూ చిన్నగా మూలుగుతున్నాడు. శిఖిముఖి, భయప డకు 'జాంగ్‌లా, ఇదుగో కొండచిలువను నరికేస్తున్నాను,' అంటూ ఎడమచేత్తో పాము మెడ పట్టుకుని ఇవతలికి లాగుతూ అదే సమయంలో కత్తితో దాని మెడ మీద బలంగా కొట్టాడు.

తల తెగిపోగానే, జాంగ్‌లా శరీరం మీది నుంచి కొండచిలువ దేహం మెలికలు తిరుగుతూ కింద పడిపోయింది.జాంగ్‌లా పెద్దగా మూలిగి ఒక పక్క దభీమంటూ పడిపోయాడు. ఈ గందరగోళం అంతా విన్న విక్రమకేసరీ, అజిత, వీరభద్రులూ అక్కడికి పరిగెత్తుకు వచ్చారు.

శిఖిముఖి, జాంగ్‌లాను లేవనెత్తేందుకు వంగుతూ, 'కొండచిలువ తల నరికాను. దాని పట్టులో చిక్కి నీ కాళ్లూ చేతులూ ఏమైనా విరిగిపోలేదు కదా?' అన్నాడు.

జాంగ్‌లా జవాబిచ్చేందుకు గొంతు సవరించుకునేంతలో చీకట్లో నుంచి 'అఘో రీలు భక్తితో పూజించే కొండచిలువ తలన రికినవాడెవడు? ఇదుగో, నీ తల నరకబో తున్నాం, కాచుకో!' అంటూ నలుగురైదు గురు భయంకరాకారులు, పెద్ద పెద్ద శూలాలు పైకెత్తి, శిఖిముఖి కేసి పరు గెత్తుకు రాసాగాడు. *(ఇంకా ఉంది)*



# 65వ సంవత్సరంలో చందమామ

1947 – తెలుగు, తమిళం
1948 – కన్నడ
1949 – హిందీ
1952 – మలయాళం, మరాఠీ

1954 – గుజరాతీ
1955 – ఇంగ్లీష్
1956 – ఒరియా, సింధీ
1972 – బెంగాలీ
1975 – గుర్ముఖి
1976 – అస్సామీస్
1978 – సింహళ
1984 – సంస్కృతం

కొన్ని ప్రచురణలు (సింధీ, సింహళ, గుర్ముఖి మరియు అమెరికాలో ద్విభాష పత్రికలు) కొంత కాలం నడిచిన తర్వాత నిలిపివేయబడ్డాయి.

2003 – జూనియర్ చందమామ. సింగపూర్ కోసం ఇంగ్లీషు-తమిళ ద్విభాషా పత్రిక. ఉత్తర అమెరికా కోసం ఇంగ్లీషు-తెలుగు, తమిళం, హిందీ, గుజరాతీ ద్విభాషా పత్రికలు.

2004 – సంతాలీ, గిరిజన భాషలో తొలి పిల్లల పత్రిక.



2008 – 7 ప్రాంతీయ భాషల్లో వెబ్‌సైట్లు ప్రారంభించబడ్డాయి. ఆన్‌లైన్ షాపింగ్ ప్రవేశపెట్టబడింది.

2011 – చందమామ డిజిటల్ ప్రచురణలు ఐప్యాడ్/ఐఫోన్ అప్లికేషన్లకోసం ప్రారంభించబడ్డాయి. ఆడియో కథలు కూడా ప్రారంభించబడ్డాయి.

అనేక భాషల్లో చందమామ, ఒక ఉమ్మడి సంప్రదాయం

# చలాకి రాము – సరదా సోము

పూర్వం శివపురంలో రాము–సోము అని ఇద్దరు కవలపిల్లలు ఉండేవారు. వాళ్లు తమ చమత్కారాలతో సమస్యల్ని పరిష్కరిస్తుండడంతో గ్రామస్థులు ఆ సోదరుల్ని చలాకి రాము–సరదా సోము అని పిలిచేవారు. జమీందారు రాజమల్లు ఆ అన్నదమ్ముల్ని ప్రత్యేకంగా పిలిపించి మరీ తన దివాణంలో ఉద్యోగాలిచ్చాడు.

ఒకసారి రాము–సోము దివాణం నుంచి తిరిగి వస్తుండగా, ఊళ్లో నారాయణయ్య అనే పెద్దమనిషి ఇంటి అరుగుమీద పదిమందీ చేరి కనపడ్డారు. అక్కడ నారాయణయ్య బావ రంగయ్య అమాయకుడైన నారాయణయ్యను అపహాస్యం చేస్తున్నాడు. రంగయ్య తెలివైన వాడే అయినా, మంచితనంలో నారాయణయ్య కాలిగోటికి చాలడు. రాము–సోము నారాయణయ్యను రంగయ్య బారినుండి కాపాడాలనుకుని, తామూ ఆ అరుగు మీదకు చేరారు.

కాస్సేపు రంగయ్య మాటలు విన్నట్టే విని, 'అయ్యా, మీరు చాలా తెలివైనవారు. మిమ్మల్ని ఒక చిన్న ప్రశ్న అడగొచ్చా' అన్నాడు రాము. రంగయ్య రామును ఎగాదిగా చూసి, 'నన్నే ప్రశ్న అడిగేంతవాడివిరా.. సరే కానీ,' అన్నాడు దర్పంగా. అప్పుడు రాము, 'అబ్బే చిన్న ప్రశ్నే బాబూ. ఒక బంతిని సగం దూరం ముందుకీ సగం దూరం వెనక్కీ ప్రయాణించేలా చెయ్యాలంటే ఎలా విసరాలి?' అంటూ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే రంగయ్య వెలవెలబోయి, డాంబికంగా, 'ఇంకెప్పుడూ ఇలాంటి పనికిమాలిన మాటలు మాట్లాడబోకు' అన్నాడు. అప్పుడు సోము, 'మీకు జవాబు తెలియనిదల్లా తెలివి మాలినదవుతుందా, బంతిని పైకి విసిరితే అది మొదట తిన్నగా పైకి అంటే ముందుకు దూసుకుపోతుంది. అలా కొంతదూరం పైకి వెళ్లి మళ్ళీ కిందకు దిగుతుంది. అంటే వెనక్కి ప్రయాణిస్తుందన్నమాట. ఈ మాత్రం మీకు తెలియదా?' అన్నాడు.

ఖంగుతిన్న రంగయ్య మా నారాయణయ్య బాబాయి జోలికొస్తే ఊరుకోమంటూ అన్నదమ్ములు చేసిన హెచ్చరికను గ్రహించుకుని నోరు కుట్టేసుకున్నాడు. – *లక్ష్మీ గాయత్రి*





# పండితపుత్రుడు

ఒకప్పుడు ప్రయాగ నగరానికి ప్రదీపుడు రాజు. ఆయన ఆస్థానంలో అనేకమంది పండితులుండేవారు. వారిలో కొందరు చాలా తరాలుగా ఆస్థానపండితులుగా ఉంటున్నవారు. అలాటివారిలో బద్రీ ప్రసాద్ అనేవాడొకడున్నాడు.

బద్రీప్రసాద్ తండ్రి, తాత, ముత్తాతలు గొప్ప పండితులు. ప్రయాగ నగరపు ఆస్థానంలో ఉండినవారు. అయితే బద్రీప్రసాద్ మటుకు కేవలం పండితపుత్రుడు. అంటే వట్టి శుంఠ. ఏళ్ల తరబడి వినటం వల్ల అతనికి వేల కొద్దీ శ్లోకాలు కంఠతఃవచ్చు గాని కొంచెమైనా ప్రపంచజ్ఞానం లేదు. పరమమూఢుడు. ఈ సంగతి రాజుకు తెలియదు.

అయితే ఆస్థానంలో ఉండే తతిమ్మా పండితులు బద్రీప్రసాద్ విషయం సులువుగా కనిపెట్టారు. అటువంటి మూఢుడికి తమతో సమానమైన స్థానం ఉండటం వారికి ఏ మాత్రమూ సమ్మతం కాలేదు. అందు చేత వారు రాజుదగ్గరికి వెళ్ళి, 'మహాప్రభో! బద్రీప్రసాద్ ప్రపంచజ్ఞానం లేని వెర్రిబాగులవాడు. అతనికి ఆస్థానపదవి ఇవ్వటం ఆ స్థానానికే అప్రతిష్ఠ. అతని తెలివితేటలు మీరే స్వయంగా పరీక్షించి చూడవచ్చు,' అన్నారు.

ప్రదీపుడు ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే బద్రిప్రసాద్ తండ్రి దిగ్గజం లాంటి పండితుడు. ఆయన చనిపోగానే ఆ స్థానం బద్రీప్రసాద్‌కు లభించింది.

విబూతి రేఖలూ, శాలువా, కర్ణకుండలాలూ ధరించి బద్రీ ప్రసాద్ చూడటానికి అందరు పండితుల్లాగే ఉన్నాడు. వాస్తవంగా ఎంత మూఢుడో పరీక్షించుదామని

కె. నరసింహారావు

రాజుగారు ఒకనాడు సభలో బద్రీప్రసాద్‌ను ఇలా అడిగాడు.

'పండితోత్తమా! కొందరు మనుషులు తాబేళ్ళను పట్టుకుంటూండగా చూశాను. వారికి తాబేళ్ళవల్ల ప్రయోజనమేమిటో నాకు అర్థం కాలేదు.'

ఇది విని బద్రీప్రసాద్ 'మహారాజా! తాబేలు పాలు చాలా రుచిగా ఉంటాయి. వాటి బొచ్చుతో కాశ్మీరు శాలువాలు నేస్తారు,' అన్నాడు తడువుకోకుండా.

రాజుకు ఆశ్చర్యం వేసింది. కాని సభలో కొందరు నవ్వారు. బద్రీప్రసాద్ మూఢుడని తేలిపోయింది. రాజు ఈవిధంగా అడిగాడు.

'పండితోత్తమా! నేనొక విడ్డూరమైన వార్త విన్నాను. ఒక కుందేలు గర్జిస్తూ సింహం మీదికి దూకిందట. ఇది నిజమై ఉండ వచ్చునా?'

'అందులో విడ్డూరం ఏమీ లేదు, మహా రాజా! సింహాలు కుందేళ్ళకు సహజమైన ఆహారమే. కుందేలు సింహం మీదికి ఉరికి కుంభస్థలం పగలగొట్టి తింటుందని శాస్త్రా లలో చెప్పి ఉన్నది', అన్నాడు బద్రీప్రసాద్

ఈసారి సభికులు మరింత గట్టిగా నవ్వారు. రాజుగారికి నవ్వు వచ్చింది.

'అయితే, పండితోత్తమా, నేనొకసారి తగులబడుతున్న చెరువును చూశాను. ఆ చెరువులో నాకు ఒక్క చేప కూడా కనిపించ లేదు. కారణం ఏమై ఉంటుంది?' అని అడిగాడు రాజు.

'చెరువు తగలబడుతున్నది గదా. అందుచేత చెరువులోని చేపలు ఒడ్డుకు వచ్చి సమీపాన గల చెట్లెక్కి ఉంటవి!' అన్నాడు బద్రీప్రసాద్.

'తామే చూశారు గదా. మహారాజా! ఈ మూఢుణ్ణి తక్షణమే ఆస్థానం నుంచి పంపి వేయండి'. అన్నారు పండితులు రాజుతో.

'ఇంతహాస్యం పుట్టించగలవాణ్ణిఆస్థానం నుంచి వెళ్లగొట్టడం మాకిష్టం లేదు. నేటి నుంచి బద్రీప్రసాదును ఆస్థాన విదూషకు డుగా నియమిస్తున్నాం!' అన్నాడు రాజు.



# పోటా పోటీ

ఒక గురువు వద్ద ఇద్దరు శిష్యులుండేవారు. వారికి ఒక్క క్షణం కూడా పడేది కాదు. వారిద్దరికీ తగాదా రాకుండా చూసేసరికి గురువుకు తల ప్రాణం తోకకు వస్తూండేది. ఆఖరుకు, ఆయన నిద్రపోయేముందు కాళ్లు వత్తేటప్పుడు కూడా వాళ్లు తగూ పడుతుండేవారు. అందుచేత గురువుగారు తన కుడికాలు ఒకడికీ, ఎడమకాలు, మరొకడికీ పంచాడు.

ఇలా ఉండగా, ఒకసారి ఒక శిష్యుడు, గురువుగారి ఎడమకాలు పట్టేవాడు, ఊరికి వెళ్లవలసి వచ్చింది. ఆ రాత్రి రెండో శిష్యుడు గురువుగారి కుడికాలు మాత్రం పట్టి వెళ్లిపోబోయాడు. 'ఒరే నాయనా, కాస్త ఆ రెండో కాలు కూడా పట్టి మరీ వెళ్లరా!' అని గురువు వాణ్ణి బతిమాలాడు. కాని ఈ శిష్యుడికి రెండోవాడిమీద ఎంతకోపమో, వాడు పట్టే గురువుగారి కాలిమీద కూడా అంత కోపమే. అందుచేత వాడు ఒక రాయి తెచ్చి గురువుగారి ఎడమకాలు మీద గట్టిగా వేశాడు. పాపం, గురువుగారు బాధతో కేకలు పెట్టి, మూర్ఖుడైన తన శిష్యుణ్ణి తిట్టి, వైద్యుడిచేత కాలికి కట్టు కట్టించుకున్నాడు.

ఇంతలోనే, ఊరికి పోయిన శిష్యుడు తిరిగి వచ్చాడు. తన కాలు కట్టు కట్టి ఉండటం చూసి, ఆత్రంగా, 'గురువుగారూ , కాలుకేమయింది?' అని అడిగాడు. జరిగిన సంగతి గురువు చెప్పాడు.

'దుర్మార్గుడు ఇంతపని చేస్తాడా? నేనేనా అంత చాతగానివాణ్ణి,' అంటూ వాడు మరింత పెద్దరాయి తెచ్చి, గురువు లబలబలాడుతున్నా లక్ష్యపెట్టకుండా, గురువుగారి కుడికాలు చితకగొట్టాడు.





# ఉత్తమ వైద్యుడు

వల్లభాపురవాసి ధనాచారి పేరున్న వైద్యుడు. ధనాచారికి పిల్లల్లేరు. ఎవరికైనా వైద్యవృత్తి నేర్పుదామనివున్నా ఏ విద్య అయినా స్వత హాగా కొంత ఆసక్తీ, అభిలాషా వుంటే తప్ప, కేవలం నేర్పితే రాదని ఆయన నమ్మకం.

ధనాచారికి దూరపు బంధువైన తిరుమ లాచారి, తన కొడుకు లిద్దరితో కలిసి వల్లభా పురానికివైద్యం కోసం వచ్చాడు. కొంతకాలంగా అతడు నారిపుండు వ్యాధితో బాధపడుతు న్నాడు. ఆయన కొడుకులు రమణుడు, రాఘువుడు ఇద్దరూ ధనాచారి చేస్తున్న వైద్య వృత్తి పట్ల ఆకర్షితులయ్యారు.

ధనాచారి వైద్యంతో రెండు వారాల్లో తిరు మలాచారి వ్యాధి బాగా తగ్గుముఖం పట్టింది. ఆయన తిరిగి నగరానికి ప్రయాణమవుతూ ధనాచారితో, ''తమరు అపర ధన్వంతరులు. కానీ, ఇంత విద్వత్తూ, మీతోనే ఆగిపోవడం, నాకెందుకో నచ్చడంలేదు,'' అన్నాడు.

అందుకు ధనాచారి, ''నే చేయగలిగిం దేమీలేదు కదా! కొంతయినా ఈ విద్యపట్ల సహజంగా ఆసక్తి, అనురక్తి వుంటే తప్ప, ఇతరులకు నేర్పలేం,'' అన్నాడు.

''నా కొడుకులు రమణుడూ, రాఘ వుడూ ఇద్దరికీ వైద్యం పట్ల ఆసక్తివుంది. వాళ్ళను మీ శిష్యులుగా చేసుకోండి,'' అని కోరాడు తిరుమలాచారి. తగిన పరీక్ష పెట్టిన తర్వాతే వాళ్ళను శిష్యులుగా స్వీకరిస్తాన న్నాడు, ధనాచారి.

ఆ జవాబుకు తృప్తిగా తలాడించి తిరు మలాచారి నగరానికి వెళ్ళిపోయాడు. ఆ ఇద్దరిలో రమణుడు తెలివైనవాడు. తొంద రగా ఆకళింపు చేసుకునేవాడు. రాఘువుడు నెమ్మదస్థుడు. విషయాన్ని ఒకటి రెండు సార్లు విని నిర్ధారించుకునేవాడు. పది రోజుల పాటు ఇద్దరికీ పలురకాల ఆకులు, మూలికలు మొదలైనవాటిని పరిచయం చేశాడు ధనా

నండిరాజు పద్మలతాజయరాం



చారి. తను వైద్యం చేసే విధానాన్ని పరిశీలిం చమని చెప్పేవాడు.

ఇలావుండగా, పక్క ఊరు భూస్వామికి బొత్తిగా అన్నహితవు పోయిందనీ, కనిపిం చని రోగమేదో ఆయనను కృంగదీస్తోందనీ, ధనాచారి వచ్చి వైద్యం చేయాలనీ కబురు వచ్చింది. ధనాచారి కబురు తెచ్చిన వ్యక్తి దగ్గర మరికొంత సమాచారం రాబట్టాడు. భూస్వామి అజీర్ణవ్యాధికి మందేం వాడాలో చెప్పి, రమణుణ్ణి పంపాడు.

రమణుడు వారం రోజుల పాటు గురు వుగారు చెప్పిన మూలికలూ, ఆకులూ నూరి గుళికలు చేసి భూస్వామికి ఇవ్వసా గాడు. ఆయనకు తగ్గినట్లే తగ్గి తిరిగి రోగం తిరగబెట్టింది. రమణుడి కేమీ పాలుపో లేదు. ఈసారి రాఘవుడు, భూస్వామి వద్దకు వెళ్ళి తాను వైద్యం చేస్తానన్నాడు. సరేనన్నాడు ధనాచారి. ముందుగా ఆయన ప్రతి రోజూ భుజించే ఆహారాన్ని తెప్పించి, పరీక్షించాడు రాఘవుడు. ఆయన భోజనం నిండా నెయ్యి, నూనెలు గుప్పించబడివు న్నాయి. అసలు లోపం ఎక్కడుందో అర్థ మైంది రాఘవుడికి.

''అయ్యా! మీరు పథ్యం చేయవలసి వుంటుంది. పది రోజుల పాటు చింత పండు రసం, చిలికిన మజ్జిగతో కూడిన భోజనం మాత్రమే చేయాలి. అప్పుడే నేను, మా గురువుగారి ఆజ్ఞగా ఇచ్చే ద్రావకం తమకు ఉపకరిస్తుంది,'' అన్నాడు రాఘ వుడు వినయంగా.

అలాగేనన్నాడు భూస్వామి. వారం రోజు లలోపుననే, ఆయన అజీర్ణవ్యాధి తగ్గు ముఖం పట్టింది. భూస్వామి ఎంతో సంతో షించి రాఘవుడికి ఘనంగా సంభావనలు ఇచ్చి సాగనంపాడు.

రాఘవుడు తిరిగి వచ్చిన సమయంలో ధనాచారి ఇంటలేదు. రమణుడు, అతణ్ణి అడిగి జరిగినదంతా తెలుసుకున్నాడు. సాయంత్రం ధనాచారి ఇంటికి రాగానే, రమణుడు ఆయనతో, ''గురుదేవా! రాఘ వుడు, భూస్వామికి చేసిన వైద్యమేమిటో తెలుసుకున్నాను. శొంఠిపొడి, జీలకర్ర, కాస్త మిరియం, మరికొంత బెల్లం కలిపి కాచిన కషాయం మాత్రమే! కానీ, నేను మాత్రం తమరు చెప్పిన వైద్యాన్నే చేశాను. అయినా ఫలితం కనిపించలేదెందుకని?'' అని అడిగాడు.

''ధనాచారి చిరునవ్వు నవ్వి, ''రమణా! వైద్యుడు రోగిని మాత్రమే కాదు, రోగాన్ని

కూడా పరీక్షించాలి. రోగానికి మూలకారణ మేమిటో తెలుసుకోగలగాలి. భూస్వామి అతిగా భోజనం చేయడం వల్ల వచ్చిన వ్యాధి. దానికి మందులకన్నా, లంఖణమే బాగా పనిచేస్తుంది. అందుకే రాఘవుడి వైద్యం ఫలించింది,'' అన్నాడు.

మరునాడు మూలికల కోసం వనంలో తిరుగుతూండగా రమణుడు, రాఘవులకు ఒక వ్యక్తి స్పృహ లేకుండా పడివుండడం కనిపించింది. చిరిగిన దుస్తులతో బక్కచిక్కి వున్న అతణ్ణి చూసి, ''ఎవడో బిచ్చగాడు. తిండి లేక సొమ్మసిల్లినట్టున్నాడు. పద, మనం వచ్చినపని చూద్దాం,'' అంటూ కదలబోయాడు రమణుడు.

''వచ్చిన పని సరే! ఆపదలో వున్న ఇతణ్ణి ఇక్కడ ఎలా వదిలిపెట్టి పోగలం,'' అంటూ రాఘవుడు అతడి ముఖం మీద నీరు చల్లి, స్పృహరాగానే, ''రమణా! ఇతణ్ణి ఇంటికి తీసుకుపోయి భోజనం పెట్టిద్దాం. ఇలా పడివుండడానికి కారణం తిండిలేక పోవ డంతో పాటు, మరేదైనా వ్యాధి కూడా వున్న దేమో పరీక్ష చేయిద్దాం,'' అని, ఆ వ్యక్తిని ధనాచారి వద్దకు తీసుకువచ్చాడు.

జరిగింది విన్న ధనాచారి, రమణుడితో, ''నిస్సహాయ స్థితిలో వున్నవాళ్ళ పట్లా, రోగుల పట్లా వైద్యుడికి సానుభూతి వుండాలి. అతడి ఆర్థిక పరిస్థితుల్ని పరిశీలించి డబ్బు తీసుకోవాలి. వైద్యుడు, రోగికి మంచి మిత్రు డిగా, శ్రేయోభిలాషిగా మసలుకోగలిగితే, వృత్తిలో రాణించగలడు,'' అన్నాడు.

ధనాచారి మాట ముగించగానే, రమ ణుడు వెల వెల పోతూ, ''క్షమించండి, గురుదేవా! వైద్య వృత్తి ద్వారా, వ్యాపారం కన్నా ఎక్కువ ఆర్జించే ఉద్దేశ్యంతో ఇక్కడికి వచ్చాను. మా తండ్రిగారి నగల దుకాణంలో ఒక నగ అమ్మితే వచ్చే లాభం, పదిమందికి వైద్యం చేసినారానట్లు కనబడుతున్నది. ఈ వైద్య వృత్తి నా మనస్తత్వానికి సరిపోదు, క్షమించండి!'' అని సెలవు తీసుకున్నాడు.

రాఘవుడు, ధనాచారి అడుగుజాడల్లో నడిచి, కొంత కాలానికి ఉత్తమ వైద్యుడిగా, ఉత్తమ శిష్యుడుగా పేరు తెచ్చుకున్నాడు.



# చెల్లయిన బకాయిలు

జగపతిరాయుడనే జమీందారు తన జమీలోని రామాపురం అనే గ్రామంలో రైతుల నుంచి బకాయిలు వసూలు కావటం లేదని విని స్వయంగా తానే ఆ గ్రామానికి వెళ్లాడు.

గ్రామకచేరీ చావడిలో రైతులంతా చేరి జమీందారుతో పంటలు సరిగా లేవని, పట్నానికి పోయి ఏ కూలోనాలో చేసుకుని వచ్చిన దానితో బకాయిలు కొంతవరకైనా కడదామన్నా ఊరు దాటి వెళ్లడానికి పక్కనున్న వాగు ఏడాది పొడవునా అడ్డంగానే ఉంటున్నదనీ, కొన్నాళ్లు బాకీలు మాపు చేస్తే తప్ప బతకలేమనీ వాపోయారు.

జమీందారు వారి విన్నపాలు విన్నాక, 'ఈ పరిస్థితిని మనం ఇన్నాళ్లూ చూస్తూనే ఊరుకున్నామా? అని అక్కడే ఉన్న గ్రామాధికారిని అడిగాడు. అందుకు గ్రామాధికారి ఈ ఓదార్పులన్నీ వింటూ కూర్చుంటే బాకీలు చెల్లుబాటు కావని కర్కశంగా అన్నాడు.

ముకుందుడు అనేవాడు రెండేళ్ల కిందట జమీందారుకు షష్టిపూర్తి జరిగినప్పుడు ఈ ఊరికి ఆనుకుని పారే చిట్టివాగుకి అడ్డుకట్ట వేయిస్తాననీ, నాడు హామీ ఇచ్చిన విషయం గుర్తు చేశాడు. జమీందారు బకాయిలకీ, ఈ విషయాలకీ ఏమి సంబంధమని కోప్పడ్డాడు.

అందుకు ముకుందుడు అమాయకంగా 'నెరవేర్చని వాగ్దానాలకీ తీర్చని అప్పులకీ తేడా ఏమీ లేదని మా అయ్య అంటూండటం జ్ఞాపకం వచ్చి అలా అన్నాడు. తప్పయితే క్షమించండి,' అన్నాడు.

ముకుందుడి మాటల్లోని అంతరార్థం గ్రహించిన జమీందారు గ్రామాధికారితో 'ఈ కుర్రవాడన్నది విన్నాక మనమే బకాయిలు ఇప్పటికి చెల్లుబాటయ్యాయని అర్థమయింది. ఈ గ్రామస్థులకి మనం చేయాల్సినవి చేయించండి,' అంటూ ముకుందుడి ధైర్యాన్ని అభినందిస్తూ వెళ్ళిపోయాడు.

– జొన్నలగడ్డ రత్న



# కెరీర్ అంటే?

ప్రవేశం/ఎంపికల ప్రక్రియ దేశవ్యాప్త రాత పరీక్ష, పైలట్ ఆప్టిట్యూడ్ టెస్ట్ మరియు ఇంటర్వ్యూ పై ఆధారపడి ఉంటుంది. రాతపరీక్షను రెండు గంటల వ్యవధిలో పూర్తి చేయాలి. దీంట్లో సాధారణ ఇంగ్లీషు, లెక్కలు, భౌతికశాస్త్రం, మరియు తర్కజ్ఞానాన్ని పరీక్షిస్తారు. కోర్సులో చేరడానికి ముందు క్లాస్ వన్ వైద్య ధ్రువపత్రాన్ని సమర్పించవలసి ఉంటుంది.



భారతీయ పైలట్ శిక్షణా సంస్థల వివరాలను కింద పొందుపర్చడమైనది.

- Indira Gandhi Rashtriya Uran Akademi (IGRUA), Raebareli, (UP) (www.igrua.gov.in).
- Orient Flight School Chennai (www.orientflights.com).
- Thakur College of Aviation, Samata Nagar, Kandivli (E) Mumbai.
- Institute of Aviation and Aviation Safety (IAAS), Mumbai.
- Rajiv Gandhi National Flight Training Institute.

వీటిని గురించి తెలుసుకోవడం నిజంగానే ఆసక్తికరంగా ఉంది కదూ...!!! ప్రపంచాన్ని చుట్టేయడాన్ని సాధ్యం చేసే కెరీర్ కోసం మీరంతా చూస్తున్నారా..! అయితే మీరు తప్పక పైలట్ కావలిసిందే.

ఇదండీ సంగతి. వచ్చే నెలలో కలుద్దాము.

– సాయి

## మెక్‌నెమరా ఆలోచనే క్రెడిట్ కార్డు ఆవిష్కరణకు మూలం

అవసరం ఆవిష్కరణలకు తల్లిలాంటిది. తొలి క్రెడిట్ కార్డ్ ఎలా వచ్చిందో ఊహించండి చూద్దాం. 1949లో ఫ్రాంక్ మెక్‌నెమరా అనే వ్యక్తి అప్పుడే రెస్టారెంట్‌లో భోజనం ముగించాడు. తర్వాత మహా ఇబ్బందికరమైన విషయం తెలిసిందతనికి. భోజనానికి చెల్లించవలసిన డబ్బులు అతడి వద్ద లేవు. దీంతో తన భార్యకు ఫోన్ చేసి ఇబ్బందికరమైన పరిస్థితి నుంచి గట్టెక్కించమని కోరాడు. ఈ సంఘటన తర్వాత అతడు డైనర్స్ క్లబ్ అనే భావనను ప్రతిపాదించాడు. ఇదే చరిత్రలో తొలి క్రెడిట్ కార్డు తయారీకి మూలమైంది.

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 34

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ` 250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ` 50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -34 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. డిసెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. ఫిబ్రవరి 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## పక్షులు



1. ముక్కు కింద 13 లీటర్ల నీటిని నిల్వ ఉంచుకునే భారీ సంచులను కలిగిన పక్షి ఏది?
2. ఆహారం అందిస్తున్నప్పుడు తన ముక్కును కిందివైపుకు ఉంచే పక్షి ఏది?
3. శత్రువులను పారదోలేందుకు దుర్వాసన కలిగిన నూనెను వెదజల్లే పక్షి ఏది?
4. ఫుట్‌బాల్‌కి రెట్టింపు సైజులో గూడు అల్లుకునే పక్షి పేరు చెప్పండి?
5. ఏ పక్షి ఈకలను పొడిలాగా మారుస్తారు?
6. పుడుతూనే 16 కిలోల బరువు ఉండే పక్షి కూనకు జన్మనిచ్చే పక్షి ఏది?
7. తన శరీర బరువుకు ఎనిమిది రెట్ల బరువైన నీటిని కలిగి ఉన్న చిన్న పక్షి ఏది?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-31 సమాధానాలు:

1. 1857 మే 10, 2. ఇందిరా ప్రియదర్శిని, 3. సుచేతా కృపలాని, 4. 1947 జూలై 1, 5. క్లెమెంట్ అట్లీ, 6. స్వార్థ త్యాగం, 7. దక్షిణ కొరియా, బహ్రెయిన్, రిపబ్లిక్ ఆఫ్ కాంగో

*August'11 Winners: 1. Deksha Dubey, Seranpore, Hooghly(Dist.), West Bengal - 712249.*
*2. Yagnesh Saradhchandra Chaphalkar, Pakhal Road, Nashik - 422006.*
*3. Shuvasish sarkar, Malda, Chobby bhawan, West Bengal-732101.*



# నవ్వుల పువ్వులు



*మహిళ:* డాక్టర్‌గారూ, నా భర్త నిద్రలోనే మాట్లాడతారండీ.
*డాక్టర్:* ఓ. అదేమంత గాభరాపడాల్సిన విషయం కాదు. నయం కావడానికి మందులిస్తాను.
*మహిళ:* అయ్యో డాక్టర్ గారూ, ఆయన నాతో ఆ సమయంలోనే మాట్లాడతారండీ.



*రవి:* నేను ప్రతిరోజూ ఏదైనా ఒక మంచి పని చేస్తుంటాను.
*అరుణ్:* చాలా మంచిది. మరి ఈరోజు ఏం చేశావు?
*రవి:* మా ఇంట్లో ఇవ్వాళ ఉదయం ఒక్కరికి సరిపోయేటంత ఆముదపు నూనె మాత్రమే ఉండింది. అందుకని నేను దాన్ని మా తమ్ముడికి ఇచ్చేశాను.



*నాన్న:* ప్రతిదీ పైకి ఎగబాకుతోంది. ఆహారధరలు పెరుగుతున్నాయి; దుస్తుల ధరలు, పన్నులు పెరుగుతున్నాయి. కానీ, ఒక్కటంటే ఒక్కటిమాత్రమే తగ్గుముఖం పడుతోంది. ఏంటది?
*కొడుకు:* దానివల్ల మీరు సంతోషించాలిమరి. తగ్గుముఖం పడుతున్న ఆ ఒక్కటీ నా రిపోర్ట్ కార్డే నాన్నా..!



*పర్యాటకుడు:* ఇది ఆరోగ్యకరమైన చోటేనా?
*స్థానికుడు:* తప్పకుండా నండీ. నేను ఇక్కడికి వచ్చినప్పుడు నేను ఒక పదం కూడా పలకలేకపోయాను. నా తలమీద వెంట్రుక ముక్క ఉందంటే ఒట్టు. గది పొడవునా నడవడానికి కూడా నాకు శక్తి ఉండేది కాదు. చివరికి పరుపు మీదనుంచి ఎత్తుకుంటే తప్ప కదలలేని పరిస్థితి.
*పర్యాటకుడు:* ఆశ్చర్యం! ఇక్కడ ఎప్పటినుంచీ ఉంటున్నావు?
*స్థానికుడు:* నేనిక్కడే పుట్టాను.

రాజ ఫలహారం

# కుకీస్ - రుచికరమైన బిస్కెట్లు



*బిస్కట్లతో పండుగ చేసుకుందాం రండి! ప్రపంచంలోకెల్లా బిస్కట్లు తయారుచేసే రెండో అతి పెద్ద  తయారీదారు భారతదేశమే మరి.*

అదృష్ట బిస్కెట్ అంటే చిన్న బిస్కెట్ ముక్క, ఇది ఒక ప్రవచనం లేదా ఉల్లేఖనతో కూడిన కాగితాన్ని కలిగి ఉంటుంది. కొంతమందికి అదృష్ట కుకీస్ చక్కటి వ్యాపారం లాంటిది. వీరు కళ్లు మూసుకుని ఏదైనా ఒక కుకీస్‌ని ఎంపిక చేసుకుంటారు. దాన్ని బల్ల వద్ద ఉన్న మరొక వ్యక్తికి అందిస్తారు లేదా తమకేసి చూస్తున్నట్లు కనిపించే కుకీని తాము తీసుకుంటారు.





అమరెట్టి అనేవి చిన్న ఇటలీ బిస్కెట్లు. ఒక పురాగాథ ప్రకారం ఒక యువదంపతులు తమ ప్రాంతాన్ని సందర్శిస్తున్న ఓ మతాధిపతిని గౌరవించదల్చుకున్నారు. అందుకని వారు బాదంకాయ, చక్కెర, గుడ్లు, పిండి కలిపి అనేక చిన్న చిన్న చప్పరించే బిస్కెట్లను తయారు చేశారు. ఆ మతాధిపతి, పలువురు ఇతరులు అమరెట్టి ప్రియులైపోయారట!

రూత్ వేక్‌ఫీల్డ్ అనే ఆమె హోటల్ యజమానురాలు, ఈమె చాకొలెట్ బిస్కట్లను తయారుచేసేది. ఈమె ఒకసారి పిండిముద్దలో నెస్లెల్ చాకొలెట్ ముక్కలను కలిపింది. ఇవి దాంట్లో కరిగిపోయి, కలిసిపోతాయని ఆమె భావించింది. కాని అలా జరగలేదు. ఆ ప్రయత్నంలో మాత్రం చాకొలెట్ చిప్ బిస్కెట్లు పుట్టుకొచ్చాయి!





లెబ్‌కుచెన్ అనేది జర్మనీలో సాంప్రదాయికంగా అల్లం బ్రెడ్‌తో చేసే ఒక సుప్రసిద్ధ వంటకం. ఈ లెబ్‌కుచెన్ల నాణ్యత ఎంత గొప్పగా ఉండేదంటే ఒక సమయంలో వీటిని పన్నులు చెల్లించేందుకు జాతీయ ద్రవ్యంగా ఉపయోగించేవారట. రాజకుటుంబానికి బహుమతులుగా కూడా వీటిని ఇచ్చేవారట.



క్రాకర్స్ అనేవి దీర్ఘకాలం మన్నిక ఉండే గట్టి బిస్కెట్లు. అందుకే నావికులను ఇవి విశేషంగా ఆకర్షించేవి. వీటికాపేరు ఎలా వచ్చింది? ఒకసారి జోసియా బెంట్ అనే బేకర్ ఒక బిస్కెట్ల బ్యాచ్‌ని ఇటుకలతో నిర్మించిన ఓవెన్‌లో ఉంచి కాలుస్తుండగా తయారైన బిస్కెట్లు పటాసుల మాదిరి మోగాయట!



పార్టీ రింగ్స్ అనేవి రంగురంగుల బిస్కెట్లు. వీటి మధ్యలో పెద్ద రంధ్రం ఉండేది. రింగ్‌రేస్‌లకు ఇవి బాగా ఉపయోగపడేవి. ఈ ఆటలో భాగంగా ఒక్కో అబ్బాయి లేదా అమ్మాయి తమ వేళ్లకు ఒక్కో బిస్కెట్‌ని అమర్చుకునేవారు. ఈ బిస్కెట్లను ఎవరు త్వరగా తినేస్తారో వారు విజేతగా ప్రకటించబడేవారు.



పెపర్‌నూట్స్ అనేవి గోధుమరంగులో ఉండి చప్పరించే కుకీలు. ఇవి కాలం గడిచేకొద్దీ గట్టిపడేవి. హాలెండ్‌లో, సింటర్ క్లాస్ అనే ప్రముఖుడి సహాయకుడు జ్వార్టె పియట్ గుప్పిళ్ల కొద్దీ పెపర్‌నూట్స్‌ని వీధుల్లో ఉన్న గుంపులమీదికి విసిరివేసేవాడట.



అల్లం బ్రెడ్ కుకీలు యూరప్‌లో చాలా ప్రాచుర్యం పొందాయి. ఇంగ్లండ్ రాణి ఎలిజబెత్-I ఈ అల్లం బ్రెడ్‌లను ప్రత్యేకంగా తయారు చేయించి ముఖ్యమైన అతిథులకు బహూకరించేదట!



క్రుమిరి ఇటలీలో చాలా ప్రసిద్ధమైన బిస్కెట్ రకం. ఇవి రూపంలో చేతి పంపు ఆకారంలో కాస్త వంపు తిరిగి ఉండేవి. ఐక్య ఇటలీకి చెందిన తొలి రాజు, బారెడు మీసాల విక్టర్ ఇమాన్యువల్ 2 గౌరవార్థం ఈ బిస్కెట్లను వక్రరూపంలో తయారు చేసేవారట.




మేకరూన్స్ అనే రకం బిస్కెట్లను క్రీ.శ. 791 లోనే క్రైస్తవ సన్యాసినిలు తయారు చేసేవారు. తర్వాత 18వ శతాబ్దిలో ఫ్రెంచ్ విప్లవం బారినుండి తప్పించుకుని నాన్సీ ప్రాంతానికి చేరుకున్న ఇద్దరు సన్యాసినులు వీటిని అక్కడ తయారు చేశారట. మెకరూన్ బిస్కెట్లను తయారు చేసి అమ్మడం ద్వారా వీరు వసతి రుసుమును చెల్లించేవారట. వీరికి ''మెకరూన్ సోదరీమణులు'' అని కూడా పేరు పడింది!



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | We will go together. | Day after tomorrow? |
|---|---|---|
| Telugu | మనం అక్కడికి కలిసే వెళతాము. | ఎల్లుండి వెళుతున్నామా? |
| Hindi | हम साथ चलेंगे।<br>హమ్ సాత్ చలేంగె. | परसों?<br>పరసోం? |
| Tamil | நாம் சேர்ந்து செல்வோம்.<br>నామ్ సేర్న్దు సెల్వోమ్. | நாளை மறுதினமா?<br>నాళై మరుదినమా? |
| Bengali | আমরা একসাথে যাব।<br>ఆమ్రా ఎక్సాథే జాబొ. | পরশুদিন?<br>పొర్షుదిన్? |
| Marathi | आपण मिळून जाऊ या.<br>ఆపాన్ మిలూన్ జావూ యా. | परवा?<br>పరవా? |
| Kannada | ನಾವೆಲ್ಲರೂ ಜೊತೆಯಾಗಿ ಹೋಗೋಣ.<br>నావెల్లరూ జొతెయాగి హోగోణ. | ನಾಡಿದ್ದೇ?<br>నాడిద్దె? |
| Oriya | ଆମେ ସମସ୍ତେ ଏକାଠି ଯିବା।<br>ఆమె సమస్తే ఏకతి జిబ్బా. | ପଅରଦିନ?<br>పార్దినా? |
| Gujarati | આપણે સાથે જઈશું.<br>ఆపనే సాథె జాయిషున్. | પરમદિવસે?<br>పరమదివసె? |
| Assamese | আমি একেলগে যাম।<br>ఆమి ఎకెలొగె జామ్. | অহাকালিৰ পিছদিনাখন?<br>అహోకాలిర్ పిస్దినాక్కన్? |
| Malayalam | നമ്മളൊരുമിച്ച് പോകും.<br>నమ్మళొరుమిచు పోక్కుమ్. | മറ്റന്നാളോ?<br>ఎత్రా మనిక్కు? |
| Santali | ᱟᱞᱮ ᱢᱤᱫ ᱛᱮᱞᱮ ᱥᱮᱱᱚᱜ-ᱟ।<br>అలె మిద్ తెల సెనోగ్–ఆ | ᱢᱮᱭᱟᱝ?<br>మెయాంగ్? |
| Sanskrit | वयं मिलित्वा गच्छाम:।<br>వయం మిలిత్వా గచ్ఛామః. | अपि श्व:?<br>అపి శ్వః? |






| English | At what time? | At three'o clock. |
|---|---|---|
| Telugu | ఏ సమయంలో? | మూడు గంటల సమయంలో. |
| Hindi | किस समय?<br>కిస్ సమయ్? | तीन बजे।<br>తీన్ బజె. |
| Tamil | எத்தனை மணிக்கு?<br>ఎత్తనై మనిక్కు? | மூன்று மணிக்கா?<br>మూన్రు మనిక్కా? |
| Bengali | কটার সময়?<br>కతార్ సొమొయ్? | তিনটের সময়।<br>తిన్‌టెర్ సొమొయ్. |
| Marathi | किती वाजता?<br>కితీ వాజతా? | तीन वाजता.<br>తీన్ వాజతా. |
| Kannada | ಎಷ್ಟು ಹೊತ್ತಿಗೆ?<br>ఎష్టు హొత్తిగె | ಮೂರು ಗಂಟೆಗೆ<br>మూరు గంటెగె. |
| Oriya | କେତେବେଳେ?<br>కెటెబెలె? | ତିନିଟା ବେଳେ।<br>తినిటా బెలె. |
| Gujarati | કેટલા વાગ્યે?<br>కెటలా వాగ్యె? | ત્રણ વાગ્યે.<br>త్రణ వాగ్యె. |
| Assamese | কোন সময়ত ?<br>కున్ గ్జొమొయొత్? | তিনিটা বজাত ।<br>తిన్‌టా బొజాట్. |
| Malayalam | എത്ര മണിക്ക്?<br>మూను మనిక్కు. | മൂന്ന് മണിക്ക്.<br>మూను మనిక్కు |
| Santali | ᱴᱤᱱ ᱡᱷᱚᱜ?<br>టిన్ ఝోగ్? | ᱯᱮ ᱛᱟᱞᱟᱝ ᱡᱷᱚᱜ।<br>పె తలాంగ్ ఝోగ్. |
| Sanskrit | कदा?<br>కదా? | त्रिवादनसमये।<br>త్రివాదన్‌సమయే. |

## బోండా తెగ మహిళలు–క్షురకర్మ



బోండా తెగ ఒడిషా రాష్ట్రంలోని మల్కనగిరి జిల్లాలో కనిపించే ఆదిమ తెగ. వీరు బోండా హిల్స్ అని పిలువబడే కొండపైభాగంలో నివసిస్తున్నారు. బోండా కొండల్లో సీతా కుండ అని పిలుస్తున్న చిన్న నీటి మడుగు ఉంది. దీనికి పౌరాణిక నేపథ్యం ఉంది. సీతారాములు వనవాస జీవితం గడుపుతున్నప్పుడు వారు దండకారణ్యంలోని దట్టమైన అరణ్యంలో నివసించేవారట. ఒకనాడు సీత సమీపంలోని నీటి మడుగులో స్నానమాడుతున్నప్పుడు తనను తాను మరుగుపర్చుకోవడానికి ఆకులతో తన ఒంటిని కప్పుకుందట. ఆ స్థితిలో ఆమెను చూసి అక్కడే ఉన్న కొంతమంది బోండా తెగ స్త్రీలు నవ్వారట. ఆగ్రహించిన సీత వారిని ఎన్నటికీ అర్ధ దిగంబర ఆకారంతో ఉండిపోవాలని శాపం పెట్టిందట. ఈ కథను నేటికీ బోండా తెగ ప్రజలు నమ్ముతున్నారు. అందుకే బోండా మహిళలు ఈనాటికీ తలపై వెంట్రుకలు లేని స్థితిలో ఉంటారు. ఇప్పటికీ వారు తమ నడుముభాగంపై కాస్తంత బట్టను వాడతారు. శరీరం పైభాగాన్ని కప్పి ఉంచడానికి మణి పూసలతో చేసిన నగలను ధరిస్తుంటారు.

## డబ్బు లేని వ్యాపారం

ఈ 2011లో ఎక్కడైనా ధనం లేకుండా వ్యాపారం జరుగుతుంటే మీరు నమ్ముతారా? దీనికి సమాధానం పొందాలంటే ఒడిషా రాష్ట్రంలోని మల్కనగిరి జిల్లా ముందిగూడను తప్పక సందర్శించాలి.



వస్తుమార్పిడి పద్ధతి మన పూర్వీకులు పాటించిన పురాతన వ్యాపార పద్ధతుల్లో ఒకటి. ఇది అనేక గిరిజన ప్రాంతాల్లో మోటుపద్ధతుల్లో కొనసాగుతూనే ఉంది. ఒడిషా, మల్కనగిరి జిల్లాలోని పురాతన బోండా తెగ ఇందుకు ఒక ఉదాహరణ.

బోండా మహిళలు తాము పండించిన కూరగాయలు, పళ్ళు, ఇతర అటవీ ఉత్పత్తులను సమీపంలోని ముందిగుడ హట్‌కు తీసుకువస్తుంటారు. తాము పండించిన వాటిని స్థానిక వ్యాపారులకు అమ్ముతూ తమకు కావలసిన బియ్యం, ఉప్పు, ఇతర రోజువారీ అవసరాలను వారినుండి మార్పిడి పద్ధతి ద్వారా తీసుకుంటుంటారు. ఈ మొత్తం వ్యవహారంలో డబ్బుకు ఏ పాత్రా లేకపోవడం గమనార్హం.

## విదూషకుడు

## బీర్బల్



# అర్థరహితమూ, అసంగతమూ



1. బీర్బల్ చిన్ననాటి స్నేహితుడు శిశుపాలుడు బీర్బల్ ప్రాపకం చూసి ఈర్ష్యపడ్డాడు. 'ఏనాటికైనా అతడి స్థానం ఆక్రమిస్తాను' అని ప్రతిజ్ఞ చేశాడు.



2. ఒకరోజు అక్బర్ అడిగాడు, 'అసందర్భ పదాల్లో అంతరార్థముంటుందా?' బీర్బల్ అన్నాడు, 'అసందర్భమైనది ఏదీ లేదు. మన వ్యాఖ్యానంలోనే తేడా ఉంటుంది.'



3. శిశుపాలుడు దీన్నొక అవకాశంగా తీసుకుని లేచి నిలబడి, 'షహెన్‌షా! బీర్బల్ చెత్తగా మాట్లాడుతున్నాడు. అతడు చెబుతున్నది శుద్ధ తప్పని నేను నిరూపిస్తాను.'



4. బీర్బల్ నివ్వెరపోయాడు. 'నువ్వు ఏదో ఒక అర్థం పర్థం లేని మాటను చెప్పు, నేను దానికి వ్యతిరేకంగా మాట్లాడతాను,' అన్నాడు శిశుపాలుడు.



5. 'ఒక పక్షి తన గూటికి తిరిగివస్తోంది, ఆ తోవ వెంబడే చక్రవర్తి వస్తున్నాడు. పక్షి నీళ్లలోకి దూరింది.' అన్నాడు బీర్బల్. 'చక్రవర్తి బాణం ప్రయోగించగా ఆ పక్షి తటాకంలో పడిపోయింది.'



6. శిశుపాలుడు బిత్తరపోయాడు. తనవంతుగా ఇలా చెప్పాడు. 'గాడిదకు గడ్డి దొరకక సింహాన్ని తన్నింది.' బీర్బల్ అందుకున్నాడు. 'ఈ మాట చాలా అర్థవంతంగా ఉంది.'



7. '....తన రాజ్యంలోని ప్రాణులందరికీ తగినంత ఆహారం కల్పించవలసిన బాధ్యత రాజుదే. రాజు తన విధిని నెరవేర్చనందుకే గాడిద సింహాన్ని తన్నింది.'



8. బీర్బల్ అన్నాడు, 'నా స్నేహితుడి మాటల్లో అంతరార్థముంది జహాపనా! తనకు తగినంత వేతనం రాలేదని అతడి బాధ. అందుకే తన్ను తాను గాడిదతో పోల్చుకుంటున్నాడు.'



9. శిశుపాలుడు వణికిపోతూ చక్రవర్తి పాదాలపై పడ్డాడు. 'షహెన్‌షా, కల్లోకూడా నేను అలా భావించలేదు. నన్ను క్షమించండి. బీర్బల్ మేథస్సు ముందు నేను నిలబడలేను.'

**మీకు తెలుసా?**

## గులాబీల ఉపయోగాలు

పిల్లల దినోత్సవం అంటేనే నెహ్రూజీ గుర్తుకు వస్తారు. ఆయన కోటు, దానిపై తగిలించుకునే గులాబీ మరపురానివి. గులాబీకి అనేక రకాలుగా విశిష్టత ఉంది.

యూరోపియన్లు పూర్వం గులాబీని రహస్యానికి గుర్తుగా ఉపయోగించేవారు. ఇంగ్లండులో సేవకులు తమ చెవుల వెనుక గులాబీలు ధరించేవారు. తాము రహస్యంగా విన్న వాటిని తిరిగి తాము బయటకు చెప్పకూడదనేందుకు గుర్తుగా వాటిని వాడేవారు. జర్మన్ ఇంటిలో గులాబీలతో కూడిన పాత్రను భోజనశాలలో పెట్టారంటే వచ్చిన అతిథులు స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చని అర్థం.

ఈజిప్టులో ఫారోలు 5,000 సంవత్సరాలకు ముందే గులాబీలను పండించేవారు. చాలా మంది ఫారోలు తమ సమాధులలో గులాబీలను ఉంచుకునేవారు.

# జంతు ప్రపంచం

ఈ నెల కొన్ని జంతువుల బొమ్మలతో మనం ఆల్బమ్ తయారు చేసుకుందాము.



ఎలుగుబంటి-పిల్ల



గొర్రె-గొర్రెపిల్ల



చిట్టి కంగారూతో తల్లి



ఏనుగు-గున్న ఏనుగు



కంచరగాడిద-పిల్ల



కుక్క-పిల్లలు

దీపావళికి
పోతీస్
సమాచారం

పటాకీలను కాలుస్తూ, కొత్త దుస్తులను ధరించి
ఈ దీపావళిని ఎంతో దేదీప్యమానం జరుపుకుందాం.

ఈ దీపావళికి కొత్తదేమిటని ప్రతి సంవత్సరం అడిగే
ప్రతి కస్టమర్ యొక్క ఆకాంక్షలను సంతృప్తి పరిచేందుకు,
పోతీస్ మీ కుటుంబంలోని సభ్యులందరికీ,
కొత్త డ్రస్‌లను ప్రవేశపెడుతోంది.

హడావిడి చేసే పిల్లల కోసం అద్భుతమైన స్టైల్స్‌లోని వెరైటీలు

**ధర: రూ. 800/- నుంచి రూ. 1,000/-**

SACHIN



పోతీస్®
అందమైన వస్త్రాల ఆలయం

ఉస్మాన్‌రోడ్, పానగల్ పార్కు, టి నగర్, చెన్నై - 17. ఫోన్: 044- 24310901. బేస్‌మెంట్ కార్ పార్కింగ్
శ్రీవిల్లిపుత్తూరు • తిరునల్వేలి • మధురై • కోయంబత్తూరు • త్రివేండ్రం www.pothys.com లో ఆన్‌లైన్ షాపింగ్ జరపండి.

sreshta

